

పండిత మదనమోహన మాలవ్యాగారు
(ఇటీవల సప్తతిపూర్తి మహోత్సవము జరిగినది.)

# ఉగాది

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

ఉగాదివేకువ. లోకమున్నదే కానుకల సందడములతోఁ గలకలలాడుచున్నది. వేగుఁజుక్క తెలిమూత్రమును బన్ని నీలమణులకై దేవులాడుచున్నది. గంధవహుఁడు చిరుముత్తెముల నొడిఁ బోసికొని దారవుపోఁచకై తడవులాడుచున్నాఁడు. తేఁటి ముంజేత గంధ మిడికొని గిన్నెకై గిరగిర తిరుగుచున్నది. విడియువిడని చిన్నిచేతుల నాలతీఁగూన విఱిసరు లల్లుచున్నది. వచ్చియురాని పవిత్రసమున సీచివురాకు ముక్తాహారములఁ గూర్చుచున్నది. తెలిసియుఁదెలియని విన్నాణమున నీలేఁగొమ్మ పూలగుత్తులఁ గట్టుచున్నది. అదిగో! చిలుక ముక్కున పవడముఁ గఱచికొనిపోవుచున్నది. సీతాకోకచిలుక చిత్రపటముగా నిరుకేల నిరికించికొనిపోవుచున్నది. రాయంచ ముంగాళ్ల పద్మరాగమణు లెత్తికొనిపోవుచున్నది.

ఆకులకు కరనై వలిలివలితిగఁ గూర్చికొన్న నాయాకుటీరమునందులనుండి యీసందడులఁ జూచుచు నాలోనే నాలోచించికొనుచుఁ గూర్చుంటిని. తెలిసియుండియు స్వప్నమాలికల సంతరించికొనుచున్నాను. అక్కడక్కడ రాలు పులుఁగుల పలుకుల నేరికొనుచున్నాను. మాగన్ను వెట్టికొనియు విశ్వమంతటి నొక్కపటమునఁ జూచుచున్నాను.

అదిగో! విశ్వకామిని పరమపురుషునకై కూర్చుచున్న పుష్పమాలికలోని క్రొంబూవు. వసంతరాగ మాలపించి వన్నెకెక్కిన యామెచివురుఁ వ్రేళ్ల! సీయుగాది పూ వెంత కలకలలాడుచున్నదో! వెలుఁగునీడలవలె నీప్రసూనదళము లొండొంటఁ గ్రిక్కిరియుచున్నవి. ఇందలి మధులేశమున కానవచ్చె మొన్నటివి లీపత్రముల కూర్పుల దారిచేసికొనఁ బ్రాఁకులాడుచున్నవి! ఈమధుకణ మాపరమపురుషుని ప్రేమమే. ఈప్రసూనవికాస మాతని మందహాసమే. జగన్మోహనమై జల్లుజల్లున నిండు వెల్లివిరియు వలపుటల లాతని యూర్పులటలే! ఆహా! ఈ పూవురేకుల శోభ లప్రతిమానములు! మహాపురుషుల చిత్రపటములఁ జిత్రింపనెత్తిన జిలుఁగువస్త్రము లివి. జగత్సౌభాగ్యమున రాగరేఖలఁ జిలుకరింపఁ దెరచిన రంగుచిప్ప లివి. చారిత్రకోదంతముల స్వర్ణాక్షరముల లిఖింపఁ బఱచిన పుటపంక్తు లివి. జీవనసాధనిర్మాణమునకై మలఁచిన చంద్రకాంతశిలాఫలకము లివి. మహాత్ముల స్వార్థత్యాగ మభివర్ణింప నిలిపిన శాసనపట్టము లివి. ఇట్లాలోచించుకొనుచుండ నేదో వినవచ్చిన ట్లయినది.

ఆజగత్కాంత చదువఁదొడఁగిన మహాగ్రంథములోని మాత్న కావ్య మీయుగాది. అదిగో! ఆమెపఠనారంభమున గళమ్ము సవరించుకొనుచున్నది. ఆగళరవమ్మునఁ జిలుకలు పలుకుచున్నవి. కోకిలములు కూయుచున్నవి. భరద్వాజములు పాడుచున్నవి. అంత నేఁ గన్ను లరవిచ్చిచూడ నుంకించితిని. ఆమె చివురాకుచేతులఁ గుసుమాంజలి ఘటించి చదువ నారంభించినది. విశాలముగ విప్పిన యామెకన్నుల కాటుక రేకలై రేయి కరగుచున్నది; క్రొందళుకై దివసము తాండవించుచున్నది; నీడలై నీలిమబ్బులు నింగిఁ బ్రాఁకుచున్నవి. ఆమె సవరించుకొను కెమ్మోవికావి ప్రకృతిహృదయమున రాగరేఖలు రచించుచున్నది. ఆమసిగోముల నలముచున్నది. నందె పూఁతల సంతరించుచున్నది. ఆమెక్రొన్నుడులు సాగరగర్భమున ముక్తాఫలములై మురియుచున్నవి. సుమముఖమ్ములఁ దేనె సోనలై దిగజారుచున్నవి. కువలయమ్మున వెలుఁగు రేకలై ప్రాఁకుచున్నవి. అదిగో! ఆమె

సవిలాసముగ నూత్నరాగ మాలపించుచున్నది. అదియే ప్రేమతరంగములుగఁ బృథ్వి నెల్లయెడల వెల్లివిరియుచున్నది. ఇందలి భావగాంభీర్యము, ఇందలి పదార్థసార్థకత, ఇందలి శైలిసామ్యము నెఱుంగ నెవఁడు సమర్థుఁడు? నాకన్నులయెదుటఁ బరమార్థవేదియగు నాపరమపురుషుఁడు నిలిచిన ట్లయినది. నాహృదయము క్రొవ్విరివలె విరిసినది.

ఓజగన్నాయకా! ఈయుగాది చిత్రవిచిత్రమై యలరారుచున్నది. నేటి వేగుజాము నీకై నీరాజన మెత్తుచున్నదో, లేక వేగుజాముమేన నీవే జిలుఁగుసాలువుఁ గప్పుచున్నావో! రేపకడ నీకై వింజామరలు విసరుచున్నదో, లేక రేపకడతల నీవే తురాయి నిడుచున్నావో! లేఁబగలు నీకై కనకాంబరముఁ బరచుచున్నదో, లేక లేఁబగటికి నీవే కావిచీరఁ గట్టించుచున్నావో! దివసము నీకై చిత్రపటముల సంతరించుచున్నదో, లేక దివసమును నీవే సింగారించుచున్నావో! లేఁబ్రొద్దు నీకై కరదీపికల నెత్తుచున్నదో, లేక లేఁబ్రొద్దునకు నీవే వజ్రకవచమును దొడుగుచున్నావో! సందె నీపదమ్ములఁ గుంకుమపరాగముఁ జల్లుచున్నదో, లేక సందెముంగాళ్ల నీవే లత్తుక పలందుచున్నావో! మునిమాపు నీకై కస్తూరికాన్క పెట్టుచున్నదో, లేక మునిమాపుకన్నుల నీవే కాటుకరేక దిద్దుచున్నావో! రేయి నీకై సన్నజాజుల నేరికొనుచున్నదో, లేక రేయిమేన నీవే మగతాలనగలు దొడుగుచున్నావో! ఏమో! ఏది యెట్లయిన నేమి? ఈదినమెల్లఁ గాన్కలతోఁ గలకలలాడుచున్నది.

ఇంతవరకుఁ బరమపురుషు ధ్యానించుచుఁ గన్నులుమూసికొన్న నేను తిరిగి స్వవిషయకచైతన్యమునఁ గన్ను లింపుక విప్పితిని. ఈయుగాదిదినమున నిరుపేదనై యూపర్ణకుటీరమున నొంటరినై యున్న నాకు, ముచ్చటకయిన నొక్క యుగాదికానుక నొసంగువారు లేరని విన్నఁబాటున ముడిచికొనిపోయి దిన్నవడిన యాకులతాంతరమున నల్లనఁ జూచితిని. విడివిడిగ వెలితివెలితిగ జారిపోయిన యాపర్ణములనందున మిలమిలలాడుచుఁ దళతళలాడుచు నేదో జారిపడిన ట్లయినది. ఉగాది విరిసిన కల్పతరుశాఖనుండి పారిజాత మొండు పట్టుదప్పి యిందుఁ బడినదేమో! ముస్తాబగుచున్న ప్రొద్దుపడఁతి చేతిముకుర మిటు జారినదేమో! ఉగాదికానుకల గంపనుండి కనకభూషణ మొండిటు దొరలినదేమో! పూదండ లల్లి యలసిన పువ్వులాడికచేతి దారపుపోచ యీయాకులదారిని జారినదేమో! ఉగాది నెగురవైచు బాలకునిచేతి గాలిపటము పైఁడిజాలి పట్టుఁదప్పి యిటు దూఁకినదేమో! ఏమో! దానిని తెలిసికొనఁ దెలివిఁగొని కన్నులు విశాలముగ విప్పితిని. సోగమేనితో, సుందరవదనసౌభాగ్యముతో, మణిభూషల ధాళధళ్యముతో, మడిలీను కావిచీరతో, మందహాసముతో, అడుగుల సడి లేకుండ, నేలదూర్వాంకురములు నలుగకుండ, ఉగాదిపడఁతి యొయ్యారముగ దిగివచ్చి నాకన్నులముంగల నిలిచినది. చీకటిని జీల్చివైచు నామెమేనితళుకు నిరుపేదనట్టింట నిలిచినది. దీనుఁడనై దిన్నవడియున్న నన్నామె తన వెచ్చని మునువ్రేళ్ల వాత్సల్యమునఁ బట్టినది. చిఱునవ్వుతో నామె నన్నుఁ బలుకరించినది. ఆమెచెక్కులు గులాబిరేకులఁ జివురించినవి. ఆమెయంగుళ్యగ్రములు మాలతీకోరకమ్ములఁ దొడిగినవి. ఆమెపదమ్ములఁ బద్మరాగోదయమయినది. ఆమెపలుచనిచీర తెరచాటునఁ దూఁగాడు మృదుకరమ్ముల నుగాదికానుక లురుకుచున్నవి. నే నానందాశ్చర్యముల నిండిన యెడందతో నాపర్ణకుటీరమును బరికించితిని. ఆ చీకటికొంపలో నుగాదిసంపుగ యొక్కమాటుగ నవతరించినది. పైఁడినీటి కలయంపి! వన్నెవన్నెల ముగ్గులు! నాఁటి యామెవాత్సల్యమునకు గాలి కరఁగినది; కటికనేల పులకించినది; చీఁకటి చిఱునవ్వు నవ్వినది. ఎందుండి వచ్చినదో! ఆమెచీరకుచ్చిళ్లు నలుగనైన నలుగలేదు. ఆమెపదతలమ్ములఁ బారాణిజాడలు చెదరనైనఁ జెదరలేదు. ఆమెమేనిచందనపు పూఁత కరఁగనైన కరఁగలేదు. ఆమెపలుచని తొగరుపెదవులమీఁదఁ దూఁగు నవ్వుటలలు తడఁబడనైన తడఁబడలేదు. అప్పుడువిరిసిన సుమమ్ము

వలె నామెముఖము క్రొందళుకులఁ గుమ్మరించుచున్నది. ఆమెకదలికల వినూత్నసౌరభమ్ములు వెడలుచున్నవి. ఆమె నవీనత, ఆమెసౌందర్యము, ఆమె వాత్సల్యము, తిలకించి నేను పులకించితిని. విశ్వాసమునఁ గరఁగిన నాహృదయము క్రొత్త గీతముల నాలపించినది. వాని రాగభేద మెఱిఁగి యామె బంగరువీణతీవల బిగించి శ్రుతిమీటినది. రసతరంగములలోలోన నిమిడ్చికొనలేక కంఠమెత్తి కావ్యముల రచించితిని. ఆమె వానినెల్ల నందే స్వర్ణాక్షరముల లిఖించినది. అప్రయత్నముగ జారిన నానుడుల నెల్ల నామె యాణిముత్తెముల పేరుగ నలంకరించికొనినది. ఆమె నాకు కానుక నొసంగవచ్చిన ఉగాదిదేవతయని నేను సవినయమ్ముగ లేచి నిలిచి వంగి యామెకు నమస్కరించితిని. ఆమెపదతలమ్మున నా మొగముసేడఁ జూచికొంటిని. తన మృదుకరమ్మున నాశిర మంటి ఆమె నన్నాశీర్వదించినది. మొగిడ్చిన నాముంజేతుల నామె పూదండ యిడినది. పులకించిన నామేన భూషణమ్ము లెన్నో తొడిగినది. కట్టికొన్న నా తెలిమడుగు పీతాంబర మయినది. నాపర్ణకుటీరము స్వర్ణకుటీర మయినది. నాచేటకన్నీటిబొట్లు ముక్తాహారము లయినవి. కటికిపేదకు కనకాభిషేక మయినది.

ఇది ఉగాదినాటి తొలిప్రొద్దువెలుఁగురేక. ఇదె నా ఉగాదికానుక.

---

# తామస ప్రణయము

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

స్వాగతగీతముల్ పాడ కుల్లాసమ్ము పొంగు చల్లార్పవే ముద్దుపికమ!
"త్రోవతప్పితివోయి బావయ్య!" యని పెడదారిఁ ద్రొక్కింపవే గోరువంక!
"పిడుగుపువ్వులు కట్టిపెట్టుమింక" నటంచుఁ గండ్లెత్తకేయవే గండునెమలి!
గుమ్మ మెక్కినయెడఁ గొంకక "పోపొమ్ము రావ"ద్దనంగదే రామచిలుక!
చిల్లువడె వీనుదోయి, గుభిల్లుమనియె – నుల్ల మాలింపనాలింప గొల్లకతలు,
ఉడికియున్న నాకన్నులఁ బడకమున్న – నంపివేయుఁడు నెచ్చెలులార! వాని.

---



శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమదేవవర్మ మహారాజులుంగారు

విజయపుర సంస్థానాధీశ్వరులు, ఆంధ్ర విశ్వవిద్యాలయ మహాధ్యక్షులు

సంస్థానాధిపత్యస్వీకారము : ౮-౬-౧౯౩౧



# దయావీర (జీమూతవాహనుఁడు)

విద్వాన్, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు

(రాజ్యము గోల్పోయి కనకవతీ జీమూతకేతువు లను తన తలిదండ్రు లతో వనవాసముచేయుచు, సిద్ధరాజకుమారిని మలయవతిని బెండ్లాడి యొకా నొకదినమున దక్షిణసముద్రతీరమున విహరింప నిచ్ఛగలిగి వచ్చుచుండును.)

జీమూతవాహనుఁడు —

అమితపటీరభూజకుసుమాప్తచయోత్తమనోజ్ఞగంధతుం
దము నయి మందమందగమనాకలితం బయి దక్షిణాంబుధి
క్రమణసముజ్ఝితోష్ణ మయి కమ్మని చల్లని పిల్లగాడ్పు నా
శ్రమ మెడఁబాపి యింద్రియపరంపరకున్ సమకూర్చె నూత్నతన్.

"అవుర ! యిదేమి దక్షిణమునం దెటు లీరజతాద్రి తోఁచె"నం
చవిరళవిస్మయంబున రయంబునఁ గాంచఁగ నేగుదేర, నే
భువనమునందు నేప్రళయపుందఱిఁ గల్గని యస్థిపుంజముల్
శివ ! శివ !, కాననయ్యె మది చిల్లులువోవఁగ నేమి పాపమో !

"గమగమలాడు చందనగంబుల పూవుల కమ్మతావు లు
ల్లమునకు బాళిఁ గూర్ప సవిలాసముగా విహరింతు నేఁ" డటం
చమితముదంబుతోడ మలయాద్రికి రా, నకటా ! యిదేమి యీ
యెముకలప్రోవు లద్రులటు లీక్షణపాత్రము లయ్యె నియ్యెడన్ !

మక్కువ నేలు వాసుకి సమాప్తము నొందినవాఁడొ! తానునున్
దిక్కటి వీరితోడనె గతించెనొ యెంత యుపద్రవం బయో!

ఇంద్రనీలపుఁబూస లిటు నటు చిమ్మినగతిఁ గన్నుగ్రుడ్డు లగ్గలము దోఁచె
మృదుతరకౌశేయసదృశంబులగు భోగతతు లిట జర్జరితంబు లయ్యెఁ
బ్రత్యగ్రసంభూతపల్లవాంకురములకరణి నాలుకలు నల్గడలఁ జెదరె
శోణమృత్పిండరాసుల చందమున మాంసఖండముల్ గుట్టలకరణి నెసఁగె
అయ్యయో! యిట్టి పాపకృత్యమ్ము సలుప - నెవ్వఁ డొడిఁగట్టినాఁడొ? తద్ధృదయ మశ్మ
మయమొ? కాదేని యీసంఘమారణమున - కెట్టు లంగీకరించుఁ గర్తృత్వ మూన?

తల్లిం దండ్రిని బాసి కందువులు, భర్తల్ చచ్చి సాధ్వీజనం,
బిల్లాండ్రన్ బెడఁబాసి గేస్తులును గూయుం బెట్టుచుండన్, గటా!
యుల్లం బింత ద్రవింప కందఱకు నాయుశ్ఛేదియై, యేమి సం
పల్లబ్ధిన్ మురియంగ నెవ్వఁడు మదిన్ భావించె నీచక్రియన్?

"ఆహవరంగ మేము యిటు లందఱు మ్రగ్గఁగ" నన్నచోఁ బర
వ్యూహమునం దొకండుఁ బడియుండఁడె? జాడయు లేదె; "సర్వసం
దోహము తామె వైరమునఁ ద్రుంగిన" వం చన యోధులట్లు లీ
దేహము లారయన్ గనను, దీనతఁ జచ్చినయట్లు గన్పడున్.

కనికరలంది నామనసు కాలి పెల్లున ప్రీలుచుండెఁ, గ
న్గొనలుఁ గదుష్ణబాష్పజలకూపము లయ్యెడిఁ గాలునేతు లే
పనికిని గాకయుండెను శవంబటు నాతను వేమొ నాకె నీ
యనుకొనఁ జేసె నెవ్వ రెదురైరొ కదా, యిట కేగుదెంచుచో?

(మఱియొకవంక చెవి యొగ్గి)

అదియే మీదెస నార్తకంఠరవ మన్న ట్లయ్యె? నౌ—నిశ్చయం
బది యింకొక్క నెలంతరోదనమునం దాలీనమై యెంతయున్
హృదయచ్ఛేదక మాచు చుండె—నదిగో నేడ్పొప్ప రక్తాంబరం
బు దల్లం దాలిచ్చి యొక్క [illegible]

ఆంగీరస సంవత్సరాది సంచిక

ట్టే యగునేని యెట్లయిన నీయమదుఃఖముఁ దీర్చి పుత్తుగా
కీయెడ నేమికీడు ఘటియిల్లెనో మెల్ల గ్రహింతుఁగా కిఁకన్.

పీఁటలమీఁది పెంక్తి యెడఁబెట్టి శరీరము వీడ వీఁడు దుః
ఖాటవిలోనఁ జొచ్చినటు లాయమ యేడ్చెడునేడ్పు దెల్పె, ని
ప్పాటను వీరి దుఃఖ మెడఁబాపకయుండిన నాశరీర మిం
కేటికిఁ, బ్రాణ మేటి కెపుడేని నశింపవె దాఁచియుంచినన్?

పాపము! బిడ్డఁ గౌఁగిటను బట్టి జనించుటఁగోలెఁ దత్కృత
వ్యాపృతులన్ స్మరించుచు ననంతముగా విలపించి తల్లి యీ
యాపదఁ దీర్పఁ డంచు దెస లన్నియు మ్రోయఁగ నేడ్వ, నొక్కఁడున్
దాపున కేగుదేఁ, డభయదాన మొసంగఁడు, కావఁ డిస్సిరో!

(సంభ్రమముతో ముందునకుఁ జని)

"అభయం బిచ్చితిఁ దల్లి! నీసుతున కేయాపత్తు రానున్న నా
దు భుజాశక్తిని దీర్చెదన్ వలయుచోఁ దొల్తన్ సమర్పింతు దు
ర్లభమౌ దేహమునైన, నీమది విచారం బింకఁ బాయందగున్
శుభరీతిన్ భవదాత్మజాతుఁ డలరించున్ బెండ్లియై మిమ్ములన్.

వీని ప్రాణంబునకు నాదు ప్రాణ మడ్డు - వైచెదను దల్లి! యేడ్వ కెవ్వారు మీరు
ఏమి యాపత్తు వచ్చె ముం దెఱుకపఱుపు - మవల దైవంబు గల దింత యడల నేల?

ఓయన్న ఫణికుమార మ-దీయానుజునిఁగను నామదిన్ నినుఁ దలఁతున్
బాయక నీకయినట్టి య-పాయము వచియింపు మెది యుపాయమొ చూతున్."

అన్న జీమూతవాహనుం డనెడిపేరి-వాఁడ విద్యాధరేశాత్మభవుఁడ నిందు
[illegible]

అర పెడుతఁటి మీయేడ్పులు - కఱుకోలలరీతిఁ జెవులఁ గాఁడిన మీకున్
శరణం బిచ్చితి నీకత - సరగున వచియింపు మనసు శాంతము గాఁగన్."

జీమూతవాహనుఁడు—

కటకట! యెంతమాట వినఁగావలసెఁ జతురబ్ధిమేఖలా
ఘటితధరిత్రి నొక్కఁడును గారుణికుం డుదయింపఁడయ్యె, ది
క్తటములు దిక్కులేని భుజగంబుల యార్పుల ప్రేలునట్లు ప్ర
స్ఫుటముగ సర్వసంహరణముం ఖగరా జొనరింప మాన్పఁగన్!

ఏమంచుం దలపోసి వాసుకి, భుజంగేంద్రుండు జీవించియే
మీమీవంతని యన్యులం బనిచెఁ జేర్చుం వేయినోళ్లున్న వం
దేమోమైనను "మీర లేటి, కిదె, నేనే మీకు మాఱై ఖగ
స్వామిం దృప్తి నొనర్తు" నంటకును వాచాకుంఠితం బయ్యెనే.

తన సుపర్ణత్వంబు గనుపింపఁజేసెనే పన్నగభక్షణావసరమందె?
తన వైనతేయత ధన్యత గొల్పెనే భుజగమాంసమ్ములోఁ బొట్ట నింపి?
తన ఖగేశ్వరత సార్థకము గావించెనే కుండలిమండలిఁ జెండివైచి?
తన విష్ణుకైంకర్యము నిజంబు చేసెనే చక్రిమండలము ధ్వంసంబుచేసి?
ఎంతవాఁడైన నేమి? కానంతపొట్ట-కడయుఁడై యున్ని జీవుల నస్వాహంబు
చించి భక్షించు నాఁకలిచిచ్చుఁగొనె-యాపగింజను నరపీనమైనఁ గాని?

తన యొకజీవముం దలఁచి, తల్లడమందుచు, నేడ్చుచుం, గలం
గిన హృదయుఁబులన్ గరుణ గీల్కొన దైన్యము నుగ్గడించుచుం,
దినదినముం మహాప్రళయనీరధి మున్గుచు నున్న నాగరా
జిని గనుచుం ఖగేంద్రుఁ డెటు జీవము దాలిచి నిల్చియుండెనో!

అంతటి దివ్యమూర్తి కిది న్యాయ్యము కాదని యొక్కఁడైనఁ గా
నంత హితమ్ము సెప్పఁడె, చరాచరసర్వజగత్ప్రణేత శ్రీ
కాంతుఁ డెటెంగి యిట్టిపని కాదని కింకరు మందలింప రాఁ
డెంత యఘంబు భోగికుల మెల్ల నొనర్చెనొ యిట్లు కూలఁగన్?

తప్పదు నాప్రతిజ్ఞ యిఁక దైన్యముఁ బాసి గృహంబు చేరి సాం
పొప్పఁగఁ బెండ్లియాడి సుఖ ముండుము, నీకును మాఱు నన్నె నే
నప్పనసేసెదం దిను మటంచు ఖగేంద్రుని, కంతఁ దప్ప నీ
ముప్పు, తనంత నాప్రతిన పూర్తివహించు, గణించి యంపుమా.

అభయం బిచ్చితి నన్ను నాలుక విశీర్ణాకారమైనం; వచో
వ్యభిచారంబున కోర్వఁజాల, ననుజన్మా! నేను జీవించియుం
డ భయం బించుక నీకు రా, దవుల నన్యాయంబుగా నండజ
ప్రభుఁడుం జంపఁడు నిన్ను—నీవు చిరముం వర్ధిల్లుమా స్వేచ్ఛమై.

నాతమ్ముండవు నీవ, యీయమయె యన్నా నాకున్ దల్లి, నా
కేతద్దీనజనావనాత్తసుకృతం బీయంగదే యంచు నిన్
జేతుల్ మోడిచి వేఁడికొందు నిఁక నాశీవించుటకున్ జిత్తమం
దేతన్మాత్రము నెంచ, కిట్లగునదే యేనాటికైనన్ సరే.

శంఖచూడుఁడు —

శివ శివ! యెంతమాటను వచించితి; నాయెడఁ బ్రేమపుట్టి య
ట్టివిధిభయంబుఁ దీర్చితి, ఘటించితి ధీరత నంతె కాని నా
యవసర మీవు దీర్పఁగ నోకంతటిదా? యసువుల్ త్యజింపఁగా
నవునె భవాదృశోత్తమున కక్కట నావిధి గాక నీదియే?

ఒరులకై వాఙ్మనసతాపమో శరీర-పీడనో పొంది వారి యభీష్టములను
దీర్పఁజనుఁ గాక ప్రాణసమర్పణంబు-నేసి యెందఱ నరుఁడు రక్షింపఁగలఁడు?

నీ వటు లేగుదేని ఖగనేత మహాగ్రహ మొంది నేఁడె భ
స్మావిలమున్ బొనర్చు భుజగాళము నెల్ల, భుజంగరాజు నా
పై విలయాగ్నియై కినియు, వ్యర్థముగా మరణింతు వీవు, నం
భావన సేయు మప్పటికిఁ బాయదు నాకు వధంబు నమ్ముమా!

నీ కంత దయయె యుండిన, - నీకెలన వెలుంగు దుర్గ కెఱఁగి మరల నే
నీకడకు వచ్చుదాఁకఁ గృ-పాకర! యిందుండు బట్టలవి యిట నుంతున్. (అని యరుగును.)

జీమూతవాహనుఁడు — (లేచి)

వధ్యశిల నెక్కుటకు రక్తవస్త్రయుగ్మ-మితఁడు గొనివచ్చె నివి ధరియించి యటకుఁ
దొలుత నే నేగి ఖగరాజతుండపూర్తి - ప్రతిపపూర్తి నొనర్తుఁగా కళిరయమున.

పాదము లంటి మ్రొక్కి- భయభక్తులఁ బక్షివిభున్ మహోఘసం
పాదక మైన యిట్టిపని మానుమటంచు వచింతునేని నా
పై దయ మాను నీవధము ప్రాజ్ఞుఁడె కా యతఁ—డిన్నినాళ్లు నా
మాదిరిఁ గోరి యెంద అవమానముఁ బొందిరొ కాక వ్యర్థులై.

అందఱు చెప్పియుందు, "రసహేయుల పీరలఁ జంపఁగా"దటం
చుం దన మొక్కలంపుఁ బరుసుందనమే బయ లెక్కఁ బక్షిరా
జందఱఁ ద్రోసిరా జను—ననన్యపథం బిది ప్రాణ మర్పణం
బిందులఁ జేసి తద్ధృదయ మెట్టిదిరైన మరల్తుఁ బూనికన్.

పక్షిరాజె కాదు బ్రహ్మాండనాయకుం-డైనఁ గాని త్యాగియంతరాత్మ
కలఁపఁగలఁడె వేఱుగాఁ జనఁగలఁడో కో-రాయియేనిగరఁగునాయముగను. (అని వెడలును.)

(తదనంతరము రక్తాంబరధారియై జీమూతవాహనుఁడు బోరగిలిపరుండియుండ గరుత్మంతుఁడు ప్రవేశించును.)

గరుత్మంతుఁడు —

నేఁ డది యేమొ నామన మనేకవిధంబులఁ జంచలించు, న
వ్వాఁడె ఫణీంద్రపుత్రుఁడ, కదే వధ్యశిలాతటి రక్తవస్త్రముల్
వోఁడిమిఁ దాల్చి పండుకొనెఁ, బోయి భుజించి మనోవికార మే
జాడఁ దొలంగునో తగ విచారణసేసి దృఢత్వ మొందెదన్.

(వేగముతో జీమూతవాహనుని బొడిచి తినుచు)

అహాహా! యీఫణియామిషంబు కడు రుచ్యంబై నవీనాకృతిన్
ముహు రాస్వాదనలోలజిహ్వకును సమ్మోహంబు వాటించు, న
న్నహహా! మెక్కెడు మాంసమట్లు గనరా, దామీఁద నీఁ డెట్లు నా
కు హితం బానటు లొత్తగిల్లు నెద సంకోచింపఁ డింతేనియున్.

కటకటా నఖరముఖంబుల వెన్ను మాంసము లొల్వఁ దనుఁగానినరణి నుండుఁ దుండాగ్రమున నస్థిమండలమ్మును భిన్నమొనరింప బాధచే నుస్సురనఁడు పక్షాహతుల భూమిపైఁ బొరలించిన నయ్యో యటంచు నుంతైన ననఁడు రక్తప్రవాహముల్ ప్రవహించుచుండిన విలపించి శరణంబు వేఁడుకొనఁడు ఎచట మాంసంబు మిగులునో యచటు చూపు-నిన్ని దినములనుండి యహీంద్రవర్గ మాహరింతును గాని యీయనువువాని-నొక్కనిం గన నిది యేమి యక్కజంబొ

(వినుట యభినయించి)

"ఆలస్య మొనరింతు వేల ఖగరాజా! మాంస మైపోవ దీ
కేలన్ గల్గు, భుజమ్మునం గలదు, భక్షింపంగ దే యిచ్ఛయై,
నాలోపం బెదియే ఘటిల్లదుగ దన్నా"యంచు వాక్రుచ్చు నీ
వ్యాళింబున్ గ్రసియింప నింద్రియము లస్వాధీన మయ్యెంగదే!

ఈతం డాఫణిజాతి కాఁ డొకమహార్షీంద్రుండు; కాఁడేని మ
చ్చాతాతిస్వగతుండదంతనఖఘాతం బోర్చి దేహాదికా
తీతుం డై పలుకంగలాఁడె యిది నా కేదో మహాపాయ, మీ
పాతిత్యంబు తరించు టెట్లో, మది కంపం బందు నత్యంతమున్!

శంఖచూడుఁడు—(సంభ్రమముతో వచ్చి బొమ్మ గొట్టుకొనుచు)

ఆఁగుమాఁగుము పక్షీంద్ర! యతనిఁ జంప-రా దతం డొక విద్యాధరప్రభుసుతుఁ డేను ఫణినయ్య, నీవంతు నేన కాని - యితఁడు కాఁ డెంత యవిమర్శకృతికి నైతి!

(సమీపించి)

వ్యాళమను నేను, ఏనుఁ బరి-శీలన గావింపు, రెండు జిహ్వలు, ఫణమం
డోలి హరిపాదముద్రలు - గ్రాలవె? యిమ్మహితుఁ దగునె గ్రసియింపంగన్?

అదె యీయుత్తముఁ గన్నవారు, సదనీయంబౌ కళత్రంబు నీ
నిదర్శన్ వజ్రనిపాతమట్లు విని క్లాంతిన్ వచ్చుచున్నారు, తే
ద్వదనంబుల్ తిలకించి యే మనుచు నోదార్పంగనౌ నీకృపా
స్పదుఁ డస్తంగతుఁ డయ్యె వీని బ్రదికింపన్ జూడు నీశక్యమేన్.

(రోదనముచేయుచుఁ దొట్రిలునడకతో కనకవతీ జీమూతకేతువులును, వారివెంట నవ
శయై దుఃఖితయగు మలయవతియుఁ బ్రవేశింతురు.)

కనకవతీ జీమూతకేతువులు——

జీమూతవాహనా! చేరరా నేమిరా, వచ్చి చేయవదేమి వందనంబు?
మముఁ గన్నతండ్రి! రాజ్యము పోయినను నిన్నె రాజ్యమ్ముగా నెంచి బ్రదుకుచుంటి;
మస్మత్తపఃఫలంబా! మమ్ము విడనాడి యరుగ నీమన సెట్లు లనుమతించె?
సన్వయాలంకారమా! నిన్నుఁ దిని కాని గరుడునాఁకలిచిచ్చు తలఁగదయ్యె!
వనములో నాకుటింటిలో వాసమున్న - నీముఖేందువు దోఁప నిర్నిద్రసుఖము
నెనసి బ్రదుకుచు నున్న మా కింకమీఁద - నేది దిక్కుగఁ జూపించి యేగితయ్య?

పాపఁడ పోటఁగోలెను గృపారస మూరఁగ నర్థివాంఛిత
ప్రాపణనైపుణీవ్రతముఁ బట్టి చరించుచు నేఁటితోడ నీ
పాఁపకుమారుఁ గాచుటకుఁ బ్రాణములన్ గడ కిచ్చి తద్వ్రతో
ద్యాపన మాచరించితె ఖగాధిపు నోజ్జగఁ జేసి నందనా!

అయ్యయొ! రక్తపూరముల నస్థులుమాత్రము గానవచ్చున
ట్లయ్యెనె మాతనూజుగతి! యభ్రగనాయక! పొట్టచిచ్చు పో
నయ్యె నటంచు వీనిని బరాను వొనర్చితి, మాకుఁ బొట్టచి
చ్చెయ్యెడ నెట్టు లారు నిఁక నెట్లు మహీస్థలి నిల్చువారమో!

ఎమ్ములు తక్క మాంసము, నొకించుక నెత్తురు, నొక్కనాడికాం
శమ్ము నెలార్పకుండ నిటు సర్వము మాసుతుమేను మ్రింగఁ జి
త్తమ్మున వాని కుండు కృప తండ్రి! యొకించుక నీదు చిత్తభా
గమ్మున సోఁకదాయె మును కల్గినఁ గల్గకయున్న నయ్యెడన్!

హా నాథ యనుచు నీపసి-కూన సుశీలావతంస కోడలు ద్రోవన్
దీనముగ నేడ్చుచును రాఁ-బ్రాణము పో కింతదవ్వు రానయితి మహో!

(అని మూర్ఛిల్లుదురు.)



గోండాల మహారాజుగారికొఱకు మైసూరి పనివారు తయారుచేసిన

సుందరశిల్పయుతమగు కజ్జలెటు



అసాముననే తేయాకుతోటలో పనిచేయుచున్న కూలీలు

మలయవతి—

నానోములు నాతపములు - నీనాటికి భస్మమయ్యెనే నాథా! యీ
మే నేల నీవు లేనిదె- నేనును నీవెంట వత్తు నిలువందగదే!

దీనులఁ గావ నాపతి స్వదేహము నీకు నొసంగి ధన్యుఁడై
పూనిన పూన్కి- తీర్చుకొని పోయెఁగదయ్య! తదాప్తి నేను నా
మేని నొసంగుచుంటిఁ దినుమీ యిదిగూడ; సుఖంతు వీవునున్
నేను సుఖంతు, నన్నుఁ గనెనేని సుఖించు విభుండు నచ్చటన్. (అని మూర్ఛిల్లును.)

గరుత్మంతుఁడు —(నిర్విణ్ణుఁడై కొంతతడ వుండి)

అకటా! వీరలు పుత్రకున్ బడసి మోహాక్రాంతులై, రింక వీ
రికి నేరీతిఁ బ్రబోధమున్ సలుపుదున్ వృద్ధత్వమం దిట్టి పు
త్రకశోకమ్మున ముంచివైచితిని దద్దామాలలామంబు కం
టికిన్ నేలకు నొక్క-ధారగను గుండెల్, గుండి మూర్ఛిల్లెఁ దాన్.

స్వార్థపరత్వ మెంతటికి వచ్చెను, నా యొకపొట్టకై మహా
నర్థము నాగలోకమున కన్వహమున్ ఘటియింతుఁ గాని యీ
స్వార్థము హేఁగా నితఁడు ప్రాణము లిచ్చు చుటుంగనైతిఁ; బా
పార్థిని గాక నా కొక మహత్త్వము చేపడు టెట్లు దైవమా!

ఈతఁడు నాగజాతికయియే యుదయించెను, గాకయున్న ని
స్స్వేతుకజాయమానకరుణారితుఁడై యిటు లేల వచ్చు? నా
కేతతి నెందఱిన్ దినిన నింత ద్రవింపని చిత్తమందు వి
ఖ్యాతకృపారసం బుదయమౌనె ఫణిప్రకరంబుఁబుట్టినన్?

ఈయస్థిరాసులను గని - నాయశ మని గరువ మొందినాఁడను గద ము
న్నీయెడఁ గన సిగ్గయ్యెడి - హేయంబగు మేను పెంప నే మచ్చె, నయో!

(మూర్ఛితులు కదలుట గని)

ఓమహనీయులార! కరుణోదధులార! వినుండి, మీసుత
గ్రామణిఁ బొట్టఁ బెట్టుకొనఁ గల్గిన కూళను నేన నిచ్చలున్
బాముల వేటలాడి తిను బాలిశబుద్ధిని గాన కన్నులం
దా మణికంబు గాఁగ నిజ మారయనైతి క్షమించి ప్రోవరే.

పన్నగుఁ డంచు నెంచి మొనసన్ దొరకొంటిని గాని యుల్ల మా
పన్నశరణ్యుఁ డీతఁ డని భావమునన్ గనుపింపఁ దిందునే?

నన్ను క్షమింపు మిప్పుడయినన్ జేయి దాటిన దేమి లేదు నా
కున్న బలంబు జూపి యమృతోద్ధృతిచే బ్రదికింతుఁ బ్రమ్మఱన్.

(అమృతవర్షము కురియును. జీమూతవాహనుఁడు లేచును.)

శంఖచూడుఁడు —

నా కొఱకుఁ బ్రాణ మిచ్చిన — యో కరుణామూర్తి! నీదు దోహమయు, జనకుల్
నీకై వగచుచు వచ్చిరి — దే కనుమా వారి వగపు దీర్చుము తొలుతన్.

(ఆశ్చర్య మభినయించును)

అయ్యో! తల్లియుఁ దండ్రియున్ సతియు నాహా యంచుఁ దన్ జుట్టుకో
నియ్యార్తావనుఁ డింత వారలఁ గనం డేమంచు వాక్రుచ్చ్వఁ బోఁ
డమ్మ్యైదిక్కులు సూచు నేమికతమో యావంక బక్షీంద్రు నే
యొయ్యన్ గాంచి నచోంటఁజూచు నదియేమో విందు వెంటాడుచున్.

జీమూతవాహనుఁడు — (నిస్స్పృహముగా)

ఎంతయకృత్యమున్ సలిపి, తే నొకఁడన్ బ్రదుకంగ భూమికిన్
వంత దొలంగునే విపులపర్వతసన్నిభ మస్థిపుంజ మం
తంతఁ జిరంతనంబు లయి యట్టుల యుండఁగ — వానిఁ జూచుచోఁ
జింతిలునన్న జీవనవిశిష్టు నొసర్చితి వెట్లు సైఁచెదిన్.

నా కొఱకై జనింప ఖగనాయక! దీనులఁ గావనేని నా
కీకుతలంబు నారకమె, యిందలి భోగులు నీదు పేరుగాఁ
గీకసరాసులై ధరణికిన్ బరువై పడియుండఁగా సుధా
సేకమునన్ సనున్ బ్రదుకఁజేయుట కెంతయుఁ జింత నొందెదన్.

బ్రొమ్మెక్కెదను, మర్దళంబు కఱుక్కెన నఖరాంచలములఁ ద్రుంపుము, కాదే
నిక్కకోదరకులములు నెక్కన బ్రదికించి యభయనియతిం గొనుమా.

అలుక దల్లిదండ్రు లసహాయతఁ గానసమంద యుండినన్
జాలిని బొంద, నీవు కరుణం దిగఁద్రావి చిరంబుగా బహు
వ్యాళకళేబరామితపరాశనవృత్తిఁ జరించుచున్ గడున్
గాళతనంబుఁ గంట కెదఁ గుందినయంతగఁ బక్షిశేఖరా!

ఆఁకలి దీఱ నాగముల నన్వహమున్ భుజియింతు నందువా
నీ కమృతంబు పానగతనీరకణం బగుఁ గాదె, యింక నీ
వాకమలాధిపాశ్రయము నందుటకున్ ఫల మయ్యె నొక్క, చీ
కాకయి, దిక్కు లేక కలయునట్టి సరీసృపులన్ గ్రసించుటల్.

గరుత్మంతుఁడు — (సాంజలిబంధుఁడై)

వచ్చినవాని నీకరణిఁ జంపఁగ న్యాయమె? నీకతంబునన్
వచ్చెను బుద్ధి, నీ వెటులు పంచద వట్టుల చేయువాఁడ, నీ
నెచ్చెలి, దాసుఁడన్ ఫణుల నేఁడు మొదల్ వధియింప, వీరలన్
జెచ్చెరఁ దెచ్చి యయ్యమృతసేకమునన్ బ్రదికింతు చూడుమా.

(సాశ్చర్యముగా సుధావర్షమును సూచించుచు)

ఫణముల్ విచ్చుచు భోగముల్ మలఁక లొప్పట్లన్ బరీక్షించుచున్
గణముల్ గట్టి స్వబంధుసంతతుల, సాకాంతంబు గన్గొంచు, నీ
గుణముల్ పేర్కొనుచున్ ఫణీంద్రము లవే కోటానకోట్లేగుచున్
వణముల్ పూనెడి, దేవతల్ సుధను బైపైఁ జల్ల న్సాప్రీతికై.

పునరుజ్జీవితనాగలోకములు సంపూర్ణానురాగంబుతో
నిను గానం బొనరించుచున్నయవి వింటే యన్న! జీమూతవా
హన! నీత్యాగమునన్ సమస్తమును సౌఖ్యం బందె నేనున్ జిరం
తనహింసారతి వీడి పుణ్యజనసత్యంబౌ యశం బందెదన్.

(దేవత లందఱును బ్రత్యక్షమయి విద్యాధరరాజ్యమున జీమూతవాహను నభిషిక్తు నొనర్తురు. అతఁడు జననీజనకులతో, భార్యతోఁ గూడి యానందించుచుండును.)

గరుత్మంతుఁడు —

లోకంబుల్ సుఖియించుఁ బెక్కుకాలముల్ పొందున్ యదృచ్ఛారతిన్
నాకున్ సాత్త్వికవృత్తి చేకుఱుత మన్నా! పైతృకప్రాభవ
స్వీకారంబున మేటివై యరయుమా విద్యాధరవ్రాత మి
ట్లాకల్పంబు 'దయావీరుఁ' డను విఖ్యాతిన్ గనుం గావుతన్.

దేవతలు — తథాస్తు, తథాస్తు.

(అందఱును నిష్క్రమింతురు.)

# ప్రౌఢవ్యాకరణకారికా విమర్శనము

విద్వాన్, మువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు

త్రిలింగ లక్షణ శేష మను నామాంతరము గల ప్రౌఢవ్యాకరణము చెన్నపురి విశ్వవిద్యాలయమున 'విద్వాన్' పరీక్షకును, ఆంధ్రవిశ్వకళాపరిషత్తున 'మధ్యమ భాషాప్రవీణ' పరీక్షకును బఠనీయముగ బఠ్యాంశము నియమింపబడుచుండుటంజేసి పలువురకుఁ బరిచితముగానున్నది. శ్రీ శే॥ సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకర రచనావసరమునందు లక్ష్యంబులకయి భారతాదిగ్రంథపరిశోధనంబు సేయుచుండఁ దమకుఁ లభించిన ప్రయోగవిశేషంబుల చేర్చిపూర్చి యీ వ్యాకరణంబు రచియించినటులు దమ పీఠికలోఁ దెలిపియుండిరి. ఇటులుండఁ గొంతకాలమునకు విజయనగరవాసులగు, శ్రీ శే॥ భాగవతుల రామమూర్తిశాస్త్రిగారు ఈగ్రంథము నాలోకించి యిందలి సూత్రములను సంస్కృతీకరించి 'హరికారికా శేషసర్వస్వ' మను పేర నొక కారికాగ్రంథము రచించియుండిరి. తత్పుత్రు లద్దానిని ముద్రింపించి ప్రకటించిరి.

తత్పుత్రు లిటులుండఁ గారికాగ్రంథపీఠికలో "శాస్త్రిగారు హరికారికలఁ బరిశీలించి వానిచేఁగూడ పొందుపఱుపని భారతాదుల ప్రయోగము లుండుటం జూచి వాని నన్నింటి నధిక శ్రద్ధతో, నతిజాగ్రత్తతో పొందుపరచి హరికారికా శేషసర్వస్వమును రచించి"రని తత్ప్రకాశకులు నిరూపించియుండిరి. దీనింబట్టి కారికాకర్తయే, భారతాది ప్రయోగముల నేకరించి స్వతంత్రముగ నీగ్రంథమును కొంత రచియించెననియు, నద్దాని కనువాదమే కాని ప్రౌఢవ్యాకరణము స్వతంత్ర గ్రంథము గాదనియు నొక యభిప్రాయము లోకమున నెలకొల్పుట వీరి వాంఛితంబని తెల్లమగుచున్నది. తన కారికల కాధారమగు ప్రౌఢవ్యాకరణంబు నొకింతయుఁ బరామర్శింపక 'హరికారికా శేషసర్వస్వ' మని నామకరణ మొనరించుటం జేసియు, "కరోమి కారికా స్సమ్యక్ హరిగ్రంథవిశేషకాః" అని గ్రంథాదిని వ్రాయుటం జేసియుఁ గారికాకర్తకుసయితము పూర్వోక్తంబగు నభిలాషయే యుండెనటులు పరిశోధకులకుఁ దోచకమానదు. గ్రంథనామమునుబట్టియుఁ, పీఠికలోని వ్రాతలంబట్టియుఁ దమ 'కారికలే స్వతంత్రము లనియు, వానింబట్టి ప్రౌఢవ్యాకరణసూత్రంబులు రచియింపబడినవి' యనియుఁ గాలక్రమంబున నిరూపణంబు గావించునా యని వీరి సంకల్పంబు. ఈరీతిగ నొకరి యశంబు నొకరు దాచించుట న్యాయ్యంబు గాదు. ఇకఁ బయిమాటలకుఁ బోక గ్రంథద్వయంబును తేటఁబూని నిష్పాక్షికంబుగఁ బరిశీలింతము. ఈ పరిశీలనంబున దేని కేది మూలమో తేటతెల్లమగును. ఇంతియకాక యీవ్యాసంబునకు వేఱొండు ప్రయోజనంబు గలదు. కారికాకర్త యాంధ్ర లక్షణగ్రంథంబులఁగాని, లక్ష్యంబులంగాని స్వతంత్రముగఁ బరిశీలింపకయుఁ, ప్రౌఢవ్యాకరణ సూత్రముల యర్థము నేని సాకల్యముగా గ్రహింపకయు నీకారికల రచించియుంటచే వీనియందుఁ గొన్ని ప్రమాదములు దొరలియున్నవి, వాని నుద్ఘాటించి లక్షణవిశేషజ్ఞానపులకుఁ జూపుట మిక్కిలి యావశ్యకంబుగదా! అట్టి ప్రమాదంబులు గల కారికలనుబట్టియే యియ్యవి ప్రౌఢవ్యాకరణసూత్రముల ననుసరించి రచింపబడినవేకాని స్వతంత్రంబులుగావను తత్త్వంబు పృథక్కృత్య నేకంబుగ విశదము కాఁగలదు. కావునఁ గారికలలోని ప్రమాదముల విమర్శించుటయుఁ, దన్మూలమునఁ ప్రౌఢవ్యాకరణమే కారికలకు మూలమను తత్త్వంబు నావరించుటయు నావ్యాసమునకు విషయంబులు—

౧. "సంఖ్యాప్రయుక్తవిశేషణ మేకాంతం బయి యసమాద్విశేష్యక మయ్యె, సమస్తంబు, వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును, పూర్వపదంబు బహువచనాంతంబు నగు." 'తదంశము—ఆ యొకటియొక్క భాగము. అనఁగా భాతిక లోపనుగది.'

ప్రౌ. శబ్ద. ౮.

ఈసూత్రంబున నవ్యయం బొకింత క్లిష్టంబగుటచే నిందలి విధి వాక్యముల రెండింటిని విభజించి చూపుచున్నాఁడను.

I ఏకాంతంబును నసమాద్విశేష్యకంబు నగు సంఖ్యాప్రయుక్తవిశేషణము సమసించినచో విశేష్యం బుత్తరపదంబయి యేకవచనాంతంబుగను, వ్యస్తం బగుచో విశేష్యంబు పూర్వపదం బయి బహువచనాంతంబుగను వర్తిల్లెడిని:—ఉదా=దెబ్బదియొక్క రథము, (సమస్తము) రథములు డెబ్బదియొక్కటి (వ్యస్తము).

II ఏకాంతాంతంబును మహదమహద్విశేష్యకంబు నగు సంఖ్యాప్రయుక్తవిశేషణము సమసించినచో విశేష్యం బుత్తరపదంబయి యేకవచనాంతంబుగను, వ్యస్తం బగుచో విశేష్యంబు పూర్వపదంబయి బహువచనాంతంబుగను వర్తిల్లెడిని. ఉదా = మహాత్ములకు రెండున్నరమానిసి (సమస్తము), మానుసులు రెండున్నర (వ్యస్తము).

అనుమానార్థమునకు :— రెండున్నర రూపాయలు (సమస్తము), రూపాయలు రెండున్నర (వ్యస్తము).

పయికీతి సీసూత్రమును లక్ష్యానురూపముగ సమన్వయించుకొనక క్రమాన్వయంబునఁ బ్రమాదముఁ జెందిరి శాస్త్రిగారు,

"సంఖ్యా ప్రయుక్తే మేకాన్త మమహాద్వ్యేకకంచ తత్,
సమస్తం యది తన్నామో త్తరభాగకతాభిధమ్.
తదంతా స్తం మహద్వాచి చామహద్వాచకంచ తత్
వ్యస్తం చే త్తద్వితేవ్యస్తు పూర్వభాగ్యస్తాంతాభిధమ్."

హరి. శేష. శబ్ద. ౩, ౪.

అనుకారికలు రచించిరి. ఈకారికలవలన, ఏకాంతమగునేని వ్యస్తపక్షమునను (దెబ్బదియొక్కటి), దిదంతాంతంబగునేని సమాసపక్షమునను (రెండున్నరమానికి, రెండున్నర రూపాయలు) బ్రసిద్ధంబులగు రూపంబులు సాధింపఁబడకున్నవి. సూత్రాన్వయంబులు గలిగి, ప్రామాణికంబయి, క్లిష్టంబుగ నున్న యీ ప్రౌఢవ్యాకరణసూత్రమును బట్టి యీకారికలు రచియింపఁబడినటులు మన మరగికరించినపక్షము నస్నే యివి యిట్లు లక్ష్యవిరుద్ధంబుగ నుండుట గారతకాని నచ్చియుక మనుంగాని లక్ష్యములఁ బరిశోధించి స్వతంత్రముగ రచింపఁబడిన కారికలిటు లుండుట యెంతమాత్రమును సంభావ్యంబు గానేరదు.

౨. "ప్రాప్తహ్రస్వంబులగు మూఁడేలమీఁది వర్ణంబులకు
ద్విత్వంబు బహుళంబుగ నగు—ఉ—ఉక్తము."

ప్రౌ. శబ్ద. ౧౦౦.

ఇటు "పదియు త్తరపదం బగునప్డు నేఁడుదొమ్మిల సమ్మిళితు బిందువును,ఎని కైమును, వీనికివర్ణ వ్యత్యయంబును, ఆపదమంబునకు సరళంబును గ్రహంబుగ నగు" (ప్రౌ—సమాస—౩౪.) "పదియు త్తరపదం బగునప్డు బూర్వపదంబుదీర్ఘంబునకు హ్రస్వం బగు-ఏను నేకు రాదు." (ప్రౌ—సమాస—౨౫.) అనుసూత్రంబులచే 'మూ + పది' యనునప్డు హ్రస్వంబును, 'ఏడు + పది' యనునప్డు వర్ణవ్యత్యయ, సరళాదేశ, హ్రస్వంబులును గలుగఁగాఁ బ్రాప్తించిన 'ముపది, డెబది' యను వానిలోని పకారబకారములకు ద్విత్వమును విధించి 'ముప్పది, డెబ్బది' యను రూపంబులను బ్రకృతసూత్రము సాధించుచున్నది.

ఈసూత్రంబునకు లక్ష్యంబులు చూపఁబడకుండుటవలనను, నిటు నవశిష్టంబగు ప్రక్రియ యీపరిచ్ఛేదంబునఁగాక సమాసపరిచ్ఛేదంబున దూరంబుగ నిరూపింపఁబడియుండుటవలనను, 'మూఁడే' లయునప్డు 'మూఁడు' అనుగిభాగమునకు హ్రస్వప్రసక్తి లేకుండుటవలనను నంతమాత్రమే గ్రహించి శాస్త్రిగారు 'మూ + డే' యను విభాగమునఁ జేసి

"కృతేహ్రస్వే త్రియచ్చబ్దో పరివర్ణో ద్విరుక్తిభాక్"

హరి. శేష. శబ్ద. ౪౦.

అని కారిక రచియించిరి.

దీనింబట్టి మూఁడుశబ్దమునకుఁ బరంబుగనున్న వర్ణంబునకును యచ్ఛబ్దార్థకమగు 'ఏ' అనుదానికిఁ బరంబుగనున్న వర్ణంబునకును, ద్విత్వ మగునని కారికయాశయము తేలుచున్నది. ఈకారికవలన 'డెబ్బది' యనునప్డు బకారమునకు ద్విత్వము సిద్ధించుమార్గము తిరోహిత మయినది. ఇటు నీసంఖ్యావాచకముల నడుమ యచ్ఛబ్దార్థకమున (ఏ) కేమి ప్రసక్తి యనిరేని నీ రూహింపకుండుటయు, నదియునుగాక "ఇద మదనేతద్భ్య త్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాణ్యవయే బహుళమ్, హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ మపర్యక్షరస్య జనయన్తి" యని నన్నయభట్టారకుండును, "అ, ఈ, ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు." "త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు." నని చిన్నయసూరియు, నీ 'త్రికంబుమీఁది' యను సూత్రమునుబట్టి "బహుళం త్వే సర్వనామాద్యే రసంయోగినో హలః" అనుకారిక రచియించి యిట్టిసంస్కృతీకరణంబునఁ గారికాకర్త కాదన్న ప్రాయంబయి యున్న కృష్ణకవియు నిట్లు పలువురు లాక్షణికులు లేక గీకనుగ సాధించియున్న 'ఏ + తెఁగు=ఎత్తెఁగు' అనునప్డు ద్విత్వముతో శేషగ్రంథకర్తయగు తనకు బొత్తిగాఁ బ్రసక్తిలేదనిరేనిఁ దలంపకుండుటయు, నదియునుంగాక యచ్ఛబ్దము నిటఁ బరామర్శించి నప్డు నేతచ్ఛబ్ద (ఈ)తచ్ఛబ్దము (అ)ల విషయమునమాత్రమిటు ద్విత్వమును విధింపవలదా యనుశంకయయిన శాస్త్రిగారికిఁ బొడమకుండుటయు విమర్శకులకు వింత గొలుపకమానవు.

౩. "కొన్నిచోట్లఁ జేతవిధక్త్యర్థకవర్ణకంబులకును, చలనవర్ణకంబునకును దఱుచుగఁ జేసి యనుప్రయుక్తం బగు."

ప్రౌ-కారక-౪.

'ఇచ్చుటంజేసి, సంప్రయోగమునఁజేసి' ధర్మతమాధవులఁజేసి' యిత్యాదులు దీనికి లక్ష్యంబులు.—

ఈ సూత్రమునఁ జేతవిధక్త్యర్థకము లనుదానింబట్టి ద్వితీయకును నవర్ణకంబునకునుమాత్రమే 'చేసి' యనుప్రయుక్తమగునుగాని 'చేత' వర్ణకమున కనుప్రయుక్తము గాదు. అట్టి ప్రయోగము (చెప్పుటచేతఁ జేసి) సకలలక్ష్యలక్షణ విరుద్ధంబు. కారికాకర్త యీయర్థంబు గ్రహింపక

"క్వచి త్తృతీయాపఞ్చమ్యో చేతస్యవలనస్య,
చేసిశబ్దాను ప్రయోగః ప్రాయశః పరికీర్తితః"

హరి-శేష-కారక-౨.

అనుకారిక రచియించెను. దీనివలనఁ బయిని చూపఁబడిన ద్వితీయాద్వర్ణకఘటితములను ప్రసిద్ధలక్ష్యము లెవ్వియు సిద్ధింపకుండుటయేకాక యెవ్వరును సమ్మతింపని 'ఇచ్చుటచేతఁజేసి' యన్ననురూపములు నిష్ప న్నము లగుచుండుటంజేసి యీకారిక యవ్యాప్త్యతివ్యాప్తిదోష దూషిత మగుచున్నది. లక్ష్యముల నెదుట నిడికొని స్వతంత్రముగ రచింపఁబడిన కారిక యిటులుండుట యెన్నండును సంభావ్యంబు గానేరదు,

౪. “ఒకండ్వాదులు పరంబులగునేని వలయుచో నున్ బగును”
ప్రౌ. సమాస. ౨౨.

దీనిచే ‘ఉన్’ అను ఆగమము విధింపబడినది. (పది + ఒకండు, = పది + ఉన్ + ఒకండు =) ‘పదు నొకండు’ మున్నగునవి దీని కుదాహరణంబులు.

ఇట సూత్రమున ‘నున్’ అనియుండుటంబట్టి యది నుగాగమమై యుండునేమో యని స్థూలదృష్టిని దలంచి కాఁబోలును శాస్త్రిగారు,

“ఒకండ్వాదౌ పరే ప్రాయః పదేః స్యాచ్చ నుగాగమః”
హరి. శేష. సమాస. ౧౬.

అని కారిక రచించిరి. దీనింబట్టి నుగాగమంబు ప్రవర్తించినయెడ ‘పదినొకండు’ అని సిద్ధించునుగాని ‘పదునొకండు’ మున్నగునవి సిద్ధింపనేరవు. తెలుఁగుసూత్రములఁ జూచి సంస్కృతీకరించునపుడు లక్ష్య సమన్వయమునఁగూడ దృష్టినుంచినచో నిట్టిప్రమాదములు దొరలకుండెడివి.

౫. “పది యుత్తరపదం బగుచో నేనుదొమ్ముల నుమ్ములకు బిందువును............అగును.”
ప్రౌ. సమాస. ౨౪.

ఈసూత్రము ‘ఏను, తొమ్మి’ అనువానిలోని ‘ను, మ్మి’ అనువానికి బిందువును విధించును. దీనిచే ‘ఏఁబది, తొంబది’ యను రూపముల బిందువులు సిద్ధించును.

పయిసూత్రమున ‘నుమ్ములకు’ అనియుండుటఁగాంచి శాస్త్రిగారు నుమాగమముల కని యర్థము చేసికొని కాఁబోలును

“పదిశబ్దే చోత్తరేతు ఏనో స్తొమ్మ్యశ్చ మైర్ద్వయోః, బిన్దుస్స్యాత్................”
హరి. శేష. సమాస. ౧౭.

అని కారిక రచియించిరి. దీనింబట్టి యిట స్థాని (మ్మి) స్వరూపమే విస్పష్టమయినది. వీరు సూత్రార్థమును సమంజసముగ గ్రహించినచో ‘నుమోర్మ్యోః’ అనికదా ప్రయోగింపవలయును. మఱియు ‘తొమ్మ్యః’ అనువానింబట్టి ప్రకృతంబున నేశబ్దమున కీప్రక్రియ యుద్దిష్టమయినదో యదియయిన వీరు సూచించినట్లు గావరాదు. ‘తొమ్మి’ అను శబ్దమునకు షష్ఠ్యంతరూపము ‘తొమ్మేః’ అనికదా యుండవలయును. ‘తొమ్ముల’ అనుచో బహువచననిమిత్తకంబుగఁ బ్రాప్తించిన యుకారమునుబట్టి యాశబ్ద ముకారాంతమని భ్రాంతిఁ జెందిరి. ఇది యెంతటి జాగరూకతయో భావింపుఁడు. ‘హరులకు’ అనుచో నగపడు ‘ఉ’ కారమునుబట్టి హరిశబ్దషష్ఠ్యంతమును సంస్కృతంబున ‘హరోః’ అని ప్రయోగించినటు లున్నది. ఇట ‘తొమ్మి’ యనుదాని ‘మ్మి’ అను దానికి బిందువు రావలయునను నర్థము శాస్త్రిగారి మనంబున నున్నచోఁ దదనురూపముగ నిపటిశబ్దములు సాధువులుగనే ప్రయోగించియుందురు కదా! అట్లుగాక యీతెలుఁగుసూత్రమునుమాత్ర మెఱుఁగుట నిశ్చయించి ప్రక్రియ నరయక కారిక రచియించుటచే నిట్టిప్రమాదము వాటిల్లినది.

౬. “మతుబర్థంబునం జెంచునకుఁ దవర్ణకంబు పరం బగునో నిత్యం బగు.”
ప్రౌ. తద్ధిత. ౪.

ఉదా: చెంచు + త = చెంచిత.

ఈసూత్రమునకు

“మత్వర్థే చెంచుశబ్దస్య తే పరే స్యా దివర్ణకః”

అనుకారిక గానంబడుచున్నది.

‘ప్రత్యయ ఇహ వర్ణకః’ అనుమున్నగు సంజ్ఞావిధానంబులం బట్టి ప్రత్యయమును వర్ణకమనియు, నక్షరమును వర్ణమనియు వ్యవహరించుట యాంధ్రలాక్షణికసంప్రదాయంబు. ఈసూత్రంబున ‘ఇ’ అనునది ప్రత్యయంబు గాకుండుటచే దీనిని వర్ణకమని వ్యవహరింపరాదు. ఈవ్యవహారంబు ప్రక్రియావిషయంబున నిటు హానికరంబు గాకున్నను సంప్రదాయవిరుద్ధం బని చూపితిని.

౭. “ఒకానొకచోఁ దద్ధార్థకంబులగు నుండు చను చేరుకొనులు ప్రశ్నార్థకకారపరకంబు లగునపుడు వాని కనియచ్చు లకు లోపంబు విభాష నగు. అనుచో నుండునకారంబు వకారంబగు. (చేరుకొను అనఁగా సమప్రయుక్తమగు కొనుధాతు వని యర్థము.)”
ప్రౌ. క్రియా. ౨.

ఉండునే, చనునే, దొరకొనునే, మున్నగువానికి ఉన్నె, చన్నె, దొరకొన్నె మున్నగు రూపాంతరము లీసూత్రమున సాధింపబడును. ఇట “తద్ధార్థకంబులగు + ఉండు, చను, చేరుకొనులు” అనువిభాగమును గ్రహింపక, లక్ష్యముల నరయక “తద్ధార్థకంబులు + అను, ఉండు, చను, చేరుకొనులు” అని విభజించికొని శాస్త్రిగారు,

“అగూండుచనుశబ్దా శ్చాసమప్రయుక్తకొను స్తథా,
తేషా మస్త్యస్య లోపోఽచో వా స్యా దుణ్డేస్తు వస్య వః”
హరి. శేష. క్రియా. ౨.

అని కారిక రచియించి యనుధాతురూపంబునకుంగూడ నిక్కార్యము విధించిరి. దీనివలన ‘అనునే’ యనుదానికి ‘అన్నె’ యను రూపాంతరంబు నిష్పన్న మయ్యెడును. భారతాదిలక్ష్యములఁ బరిశీలింపఁ బనిలేదుగాని ప్రౌఢవ్యాకరణకర్త చూపినలక్ష్యములఁ బరికించినను నింతటి ప్రమాదములు లేకుండెడివి. వీరు ‘అన్నె’ యను రూపమును సాధింపఁదలంచి ‘అగూండుచనుశబ్దాశ్చ’ యని యుద్దేశ్యగణంబున ననుధాతువునుగూడఁ జేరిచియుందురో లేక పయిని జూపినరీతిని తెలుఁగుసూత్రమునఁ బదవిభాగమునఁ బ్రమాదపడి యీరీతిని గారిక రచియించియుందురో విమర్శకులు పరిశీలింపఁదగుదురు.

౮. "ఆర్యాద్యర్థ మెుక్కచో నటుశబ్దపూర్వకంబు నగు"
ప్రౌ. క్రియా. ౫.

అనుప్రయుక్తంబు లగు 'అయ్య, అమ్మ,' మున్నగువానికిఁ బూర్వము 'అటు' శబ్దము కొన్నియెడలఁ బ్రయోగింపఁబడునని యీసూత్రమునకుఁ దాత్పర్యము.

"చెల్లునటయ్య, చెల్లునటమ్మ- దయసేయక తిన్నని మేను వెన్నెలన్ వేఁతురటమ్మ యింత కనువేదురు సెల్లునటమ్మ యింతికిన్" ఇత్యాదులు లక్ష్యంబులు.

ఇట సూత్రంబునందును బయినిఁజూపఁబడిన యుదాహరణంబులందుఁ బలుతావులను 'నటు' అని యగపడుచుండుటంబట్టి యయ్యాది 'నటు' శబ్ద మని భ్రాంతివడి శాస్త్రిగారు.

"ఆర్యాద్యర్థో భవే దత్ర కుత్రచి న్నటుపూర్వకః"

అని కారిక రచియించిరి. కాని పయియుదాహరణ పద్యమునందలి 'వేఁతురటమ్మ' యనుచో 'అటు' శబ్దమును గుఱితింపరయిరి. అద్దానిని గుఱితించినయెడ నన్నిలక్ష్యంబులందును ననుగతం బగునటులు 'అటు' శబ్దపూర్వకత్వమునే విధించియుందురుగదా! పయికారిక ప్రౌఢవ్యాకరణసూత్రమునుబట్టి రచింపఁబడక స్వతంత్రముగనే రచింపఁబడినయెడ 'నటుపూర్వకః' అని నటుశబ్దఘటిత మయియుండుట మిక్కిలి యసంభవము.

పయిని వివరించిన విషయములంబట్టి శాస్త్రిగారు భారతాదులందలి ప్రయోగవిశేషంబులను దాము గనిపెట్టకుండుటయకాక ప్రౌఢవ్యాకరణకర్త యుదాహరించిన ప్రయోగంబులందలి విశేషంబులయిన గుఱితింపకుండుట విశద మగుచున్నయది. ఇంతియకాక కారికలందలి భాషాస్వరూపమును బట్టి సంస్కృతభాషయందుసయితము వీరి కంతగాఁ బాటవ ముండినటులు గానరాదు. క్రిందిప్రయోగములను బరిశీలింపుఁడు.

"క్వచి ద్ద్విత్వస్య ప్రామాణ్యప్రయోగేషు న దృశ్యతే, ద్విత్వమ్............"
సంధి. ౨.

ప్రామాణికప్రయోగములనికాని, ప్రమాణప్రయోగములనికాని యనుటకు మాఱుగాఁ బ్రామాణ్యప్రయోగములఁట!

"దృశ్యతే సర్వపర్యాయయెల్లశబ్దస్య సప్తమీ"
సంధి. ౪.

'సర్వపర్యాయయెల్లశబ్దస్య' యనుసిద్ధసమాసంబునడుమ యడాగమంబు సిద్ధించు టెట్లు?

"క్వచిత్క్వచి ద్భవేదప్రధానం ప్రాధాన్యవాచకమ్"
శబ్ద. ౭.

ప్రధానవాచక (విశేష్య) మనుటకుఁ బ్రాధాన్యవాచకమఁట!

"పూరుషాణాంచ పృచ్ఛాయాం నిర్దిష్టస్త్రీనరోర్గిరేః"
శబ్ద. ౩౧.

నృశబ్దమునకుఁగాని, నరశబ్దమునకుఁగాని షష్ఠీద్వివచనాంతరూపంబు 'నరోః' అని సిద్ధించు టెట్లు?

"ఏకద్విత్రిపదోఽపి స్యాత్" శబ్ద-౬౧.

"పోలెపోని బలేపదాః" సమాస-౩౨.

"అకారాన్తావ్యయః కళా"
సంజ్ఞా. ౪.

"ఇనన్న నక్రియాపూర్వకాః కా స్వవ్యయా ఇహ"
వాక్య. ౧౨.

ఈరీతిని 'పద' శబ్దమును, నవ్యయశబ్దమును నిట్టియెడఁ బుంలింగముగఁ బ్రయోగింతురా?

"పరే సతీంచుశ్చస్య స్యాత్ప్రకారో నహి దృష్టవాన్"

'నదృష్టః' (చూడఁబడలేదు) అనుదానికి 'నదృష్టవాన్' అనునది పర్యాయముగఁ బ్రయోగింపఁబడునా?

ఈరీతిని సంస్కృతాంధ్రముల రెంటను దగిన పాటవంబు గడింపనివా రిట్లు లక్షణగ్రంథములను స్వతంత్రంబుగఁగాని, యనువాదరూపంబునఁగాని రచియింపఁబూనుటకంటె నుదాసీను లగుట యుక్తమపద్ధతి. అదియ భాషకు మహోపకారకంబు. ఇట శాస్త్రిగారి లోపము లెంచుట నా ముఖ్యోద్దేశంబుకాదు. ఎన్నియో వత్సరంబు లెంతయో పరిశ్రమ మొనరించి యీప్రయోగవిశేషంబుల నేర్చి కూర్చిన సీతారామాచార్యుల ప్రౌఢవ్యాకరణంబునకుఁ గల వాస్తవికంబగు ప్రాథమికత్వంబును వెలువరించుటయుఁ, గారికలందలి ప్రమాదంబులను విద్యార్థిలోకంబున కెఱుకపఱుచుటయు నాయుద్దేశములు. మఱియుఁ గారికలకుఁ బ్రౌఢవ్యాకరణమే మూల మనుటకుఁ దగినయాధారము లింకను గారికలం దుపలబ్ధంబులయినను వానినెల్లఁ జూపఁబనిలేదనియుఁ, బయిని నిరూపించిన విషయంబులే తత్త్వనిర్ణాయకంబులు గానోపుననియు నిప్పటి కింతటితో విరమింపఁదలంచితి.



కలారామ దేవాలయము, నాసిక



సూర్యాస్తమయము (తిరుచినాపల్లి వద్ద) M. K. R.

రామాయణమునందును గనఁబడెడిని. శ్రీవాసిష్ఠమున శ్రీరామ బోధ కొఱకు చేయబడిన ఉపాఖ్యానములఁ గొంతవఱకట్లే గలవికథ కనిపించునే కాని శ్రీరామచరితము లేదు. శ్రీవిశ్వామిత్రమహాముని తన యాగ సంరక్షణార్థము శ్రీరామునడుగుటకై శ్రీ దశరథమహారాజు కడ కేతెంచిన భాగ మొకటిమాత్ర ముభయస్థలములలో నున్నది. అందు బాలకాండ ౧౮ వ సర్గలో ౪౩ వ శ్లోకము మొదలు మూఁడు సర్గలలోని విశ్వామిత్రదశరథసంవాదరూపకథలో శ్లోకములలో పదసామ్యార్థసామ్యతాత్పర్యసామ్యకథాసామ్యములుమాత్రమేకాక అవియే శ్లోకములు ప్రాయశః రచియింపఁబడియున్నవి. వాసిష్ఠమున వైరాగ్యప్రకరణమునందలి ౬ వ సర్గ ౬ వ శ్లోకము మొదలు చూడందగును. మఱియును పదప్రయోగమునందును, ఉపమాద్యలంకార నిరూపణమునందును, పదమైత్రియందును, శయ్యయందును, బుద్ధిశాలి విమర్శనాబుద్ధితో రామాయణద్వయమును పరిశీలించినచో శ్రీమద్రామాయణకర్తయగు శ్రీవాల్మీకియే వాసిష్ఠమహారామాయణమునకుఁ గర్త యనువిషయమున నించుకేనియు సందేహింపఁడు. వాసిష్ఠమునందు విషయము కేవలాద్వైతము గాన కొన్ని స్థలములలో శ్లోకములకు తాత్పర్యము గ్రహించుట కష్టముగనే కాని శైలి కఠిన మగుటవలన దురవగాహమని కర్తృభేదమును శంకింపరాదు. కథారామాయణమునందు షట్కాండములు, వాసిష్ఠమునందు షట్ప్రకరణములు. అందుత్తరకాండము నిందుత్తరభాగము. వాల్మీకి రచించినవెంటనే కుశలవుల కుపదేశించినట్లు పూర్వరామాయణమునం దున్నది. భరద్వాజున కుపదేశించినటులు వాసిష్ఠమునం దున్నది. ఇత్యాదిసందర్భములును సరిపోవుచున్నవి.

౩. బాలకాండమునందు విశ్వామిత్రమహామునిసమాగమనసందర్భము వచ్చునప్పటికి శ్రీరామచంద్రమూర్తి పదునాఱుసంవత్సరముల కించుకతక్కువ వయస్సునందుండి సకలతీర్థముల సేవింపవలయునను యభిలాషతో దశరథుఁ బ్రార్థించి ఆయనయనుమతిఁ బరివారసమేతుఁడై తీర్థయాత్రఁ జేసివచ్చి అనన్యలభ్యమగు వైరాగ్యముతో నుండి, దశరథుండు పామరప్రవృత్తితో లౌకికకృత్యముల నాచరించుటకు ప్రోత్సహించుచు స్వయముగను, నన్యముఖముగను ప్రేరేపించుచుండ విషయవైరస్యముచే నిట్టివ్యాపారమునందును మనసు మంచక తనలోఁదానే పిచ్చివానివలె నేమేమియో గొణఁగుకొనుచు మందమనమయమున నవయస్కులగు పరిచారకులను బిలిచి తండ్రి "మీతో నేమైన నెప్పుడైన రాముఁడు ముచ్చటించునా?" యని యడుగ వారలు "తొల్లిటి వగిది హర్షాతిరేకముగ మాటలాడుట లేదు. భుజించుట లేదు. కారణమేమైయుండునో మాకు తెలియదుగాని సమీపమునకుఁ బోయి వినిన మాత్రము 'నీత మాయు రసాయనపదప్రాప్తివర్జితైః, చేష్టితై రతి కాకల్యా భూయోభూయః ప్రగాయతి' (అనఁగ సంసారశ్రమహారమగు బ్రహ్మప్రాప్తి కలుగని చర్యలతోనే పర్యాయము గడపఁబడుచున్నది) యని సూక్ష్మమధురస్వనితో గానముచేయు"నని చెప్పఁగ విని వసిష్ఠవిశ్వామిత్రదశరథమహారాజులు రాముని సభకురావించి యడుగ దేహమును బాల్యాద్యవస్థలను స్త్రీలను కాలమును అనిత్యత్వాది బహుదోషయుక్తము లగుటచే సహేతుకముగ నిందింపఁగ విశ్వామిత్రాది మునిపుంగవులు, బ్రహ్మర్షులు, రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మేంద్రాది దేవతలు, సిద్ధసాధ్యాది ఖేచరులు, భూచరులు సభ నలంకరించియుండఁగ రాముని వైరాగ్యసంపదను జూచి యచ్చెరువొంది రామునకు తగిన జ్ఞానము నుపదేశింపుమని ప్రార్థింప, శ్రీవసిష్ఠమహర్షి తన జన్మవృత్తాంతమును, వేదాంతప్రచారనిమిత్తంబును క్రమముగ వక్కాణించి జ్ఞానోపదేశము చేయ నారంభింపఁగ ముముక్షువై శ్రీరాముఁడు మధ్యమధ్య ప్రశ్నించుట, దానికి సదుత్తరము వసిష్ఠుఁడు బోధించుట, తుదకు 'కృతార్థోఽస్మి' యని రాముం డనుటకు ౩౨ వేల శ్లోకములుగల గ్రంథము రచింపఁబడినది.

౪. ఇవను బాలకాండకథలో నేకదా శ్రీరామునిగూర్చి వసిష్ఠోపదేశము. పైన జరిగినకథకాని ఉత్తరకాండమున జరిగినకథ కాని లేకయుండె వాసిష్ఠరామాయణ ముత్తరరామాయణ మెట్లు యనఁబడినదని యందు లేని పురాణస్మృతులవలె నేకోపబృంహకమగు శ్రీరామాయణములలో వేదపూర్వభాగమున చెప్పఁబడిన ధర్మజాతమును రామాచరణమూలమున ప్రకటించినదగుటం జేసి శ్రీమద్రామాయణమునకుఁ బూర్వరామాయణ మనియు, ఉత్తరభాగమగు నుపనిషత్తులలో బోధింపఁబడిన జ్ఞానము రామోపదేశముగ బోధించినదిగావున వాసిష్ఠమునకు నుత్తరరామాయణ మనియు ప్రసిద్ధి కలిగినది. ధీరోదాత్తుండగు శ్రీరామచంద్రుని రెంటియందును కథానాయకునిగనే వాల్మీకి చేకొనినాఁడు. కాని పూర్వమున స్వతంత్రునిగ గ్రహించెను; ఉత్తరమున ముముక్షువైన వసిష్ఠశిష్యునిగ గ్రహించినాఁడు. శిష్యునిగ గ్రహించినమాత్రమున ధీరోదాత్తనాయకత్వమునకు భంగము వాటిల్లదా యని శంకించినచో వాసిష్ఠరామాయణమునకు వ్యాఖ్యానమును రచియించిన శ్రీమదానంద బోధభిక్షువు వ్యాఖ్యానపీఠిక శ్లోకములలో

శ్లో. "అనిశాన్నత్యర్థసిద్ధం బహిరపి కలయన్ శిష్యభావం వితేనే
యః సంవాదేన శాస్త్రామృతజలధి మముం రామచంద్రం ప్రపద్యే."

(అనఁగ పూర్ణానందస్వభావుండును పరమేశ్వరుండు దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మస్థాపనలకొఱకు నారాయణమూర్తి విగ్రహుఁడై యవతరించి దయచే, నజ్ఞానమహాపంకమునందు మునిఁగినవారల నుద్ధరించుటకు వసిష్ఠులోపలఁ బ్రవేశించి బాహ్యమునకు రామచంద్రస్వరూపమున శిష్యభావమును వెల్లడించుచుఁ దనకును వసిష్ఠునకును సంవాదరూపమున శాస్త్రామృతజలధియైనవాఁడు, అట్టి రామచంద్రుని భజించెదను) అని నుడివిన వచనమును జూడ నట్టి శంక శమించును. మఱియు మూలములో నిర్వాణప్రకరణములో శ్రీరామచంద్రుని సాక్షాత్పరమాత్మగనే వక్కాణించియున్నాఁడు.—

శ్లో. "అవతీర్ణ స్స్వయం విష్ణు ర్యాదృశ్యో రామనామభృత్,
భిన్నస్సంసారజాలేఽస్మిన్ యోగే నాసేన బోధితః."

మాయవలసియున్న కప్పము సెగ్గలైచిరి. అంత వారిపై ఆనవేమారెడ్డిడు దాడివెడల, వారొక రాయబారిముఖమున వానిని కిట్లు కబురంపిరి: "ఇంతసేన వ్యర్థముగా నశింపనేల? మొనగాని నొకరి నేర్పఱిచికొని, ద్వంద్వయుద్ధము సేయ నాజ్ఞాపింతము. అప్పుడు జయాపజయములఁ బట్టి మన గెలుపోటముల నిర్ణయింతము." ఇట్లు వర్తమాన మంపినపుడు, తనసేనయందుఁ దగినవారిని నొక్కనినైనను గాంచనేరమి, అనవేముఁ డేమియుఁ బాలుపోక దిక్కులు చూచుచుండ, సదాశివనాయఁ డా పనికిఁ దా నంగీకరించు ననెను.

"అని తేనేగ సదాశివప్రభుఁడు ద్వంద్వయుద్ధసన్నద్ధుఁడై
తనతో మార్కొనఁబూనియున్న రిపుయోధశ్రేష్ఠుతో పోహరిం
చి, నితాంతశౌర్యము మాచరించి, యతనికి సింహంబు మత్తద్విపం
బుమతో లెంచుచిమెఱపిరా హితులకుఁ బోదంబు ఛేదింబుఁ గాన్."

ఇట్లు

"పెనఁకువ నొర్చి, శాత్రవుల చిట్టరిగాఁపులఁ జేసి, రాజరా
జనిరెడ్డి వాసి రెడ్డి కలరార్పుటఁ దా నల వాసిరెడ్డి నాఁ
దనరె సదాశివప్రభుఁడు ధాత్రి; క్రమంబున వాసిరెడ్డి నా
దవఁగఁ దదీయవంశభవు లందఱు విశ్రుతి కెక్కి రున్నతిన్."

ఈరీతి వైరుల హతమొనర్చి, తన పేరుప్రతిష్ఠలఁ గాపాడఁ జాలుటచే, మిగుల సంతసించి, అనవేమహార్వారెడ్డి సదాశివనాయనికి దక్షిణదేశమం దొకకొంతభాగ మిచ్చి, 'రాజా' బిరుద మొసంగి గౌరవించెను. ఇట్లా ప్రభువుచే ననుజ్ఞాతుండై సదాశివనాయఁడు రాజ్య మేలుచుండ, వానిని పూర్వపువైరులు ఒకానొకరాత్రి వానిని బంధుమిత్రయుతముగ సంహరించిరి. దైవకృపవలన నెట్టులో, ఒక బ్రాహ్మణ పురంధ్రి సాహాయ్యమున సదాశివప్రభుని పుత్రుఁడు, రెండేండ్ల ప్రాయముగల శ్రీగిరిమల్లిఖార్జుననాయకుఁడు వైరులచేఁ జిక్కక, నిజ మాతామహస్థానమును జేరఁగల్గెను. ఇతని సంతతియే క్రమేణ శాఖోపశాఖలుగా బయలుదేఱి, వృద్ధిఁ జెంది జగమున విఖ్యాతి కెక్కినది. సదాశివనాయనియందు గౌరవాదరములుగల, ఆనాఁటి ఓఢ్రకర్ణాటదేశపాలకు లందఱు తమకు గప్పముకట్టు నేర్పాటుమీఁదఁ గొంత భూమిని శ్రీగిరిమల్లిఖార్జుననాయని సంతతివారికి 'మిరాశిదఖల్' పంచిరి.

ఇట్లు వృద్ధిగాంచిన వాసిరెడ్డీయులలో వీరపనేఁడు సుప్రసిద్ధుఁడయ్యె. తనతో సమానులగు వీరులు లేరనుటు లీతఁడు 'ముస్తఫానగరి' సేరిటిరాష్ట్రమును బరిపాలించెను. ఇతనికి రాఘవయ్య, చౌదరిరామన్న, చంద్రమౌళి అను ముగ్గురు పుత్రులు గలిగిరి. ఒకప్పు డీముగ్గురును గొంతదేశము సంపాదింపఁగోరి ఢిల్లీబాదుషాహాను బోయిమాచిరి.

"కని, యప్పాదుషహాకు విక్రమచమత్కారంబులకు, హర్షపూర్తినిఁ గావించి, తదీయుల్ల నల నందిగ్రామసీమోపవ

ర్గవశవర్వంబునకుఁ గ్షేత్రంబుగ జమీందారీమిరాశిదఖల్,
ఘనసమ్రాడ్విరుదాంకముల్ వడసి జేవ్వ్రాలవచ్చి, రత్యుత్సుఖల్."

తమ స్వార్జితమయిన నందిగామసీమయంతయు మూఁడుభాగములుగా విభాగించుకొనిరి. పెద్దవాఁడైన రాఘవయ్యకు మాగల్లువంటును, రెండవవానికి రాఘవపురియును, తృతీయుఁడగు చంద్రమౌళికి చింతలపాటివంటును వాలువచ్చినవి.

చింతలపాటివంటున కధిపతియైన చంద్రమౌళి కృష్ణాతీరమున నెలసియున్న ముక్త్యాల రాజధానిగాఁ గొంతకాలము రాజ్యముచేసిన పిమ్మట వానిని పుత్రుఁడు రాఘవయ్య రాజ్యమునకు వచ్చి పరిపాలించెను. ఈయనకు రాజమౌళి అచ్చన్నగారు లను పుత్రద్వయము గల్గెను. పెద్దవాఁడైన రాజమౌళి పెద్దకాలము ప్రజారంజకముగ రాజ్యమేలి అమితదానపరుఁడై 'నిస్సీమభూదానచక్రవర్తి' అను బిరుదము గాంచినాఁడు. ఈరాజమౌళికి శ్రీచంద్రమౌళియు, నాతనికి రామలింగ వీరన్న ప్రభువు లను వారలును జనించిరి. జ్యేష్ఠుఁడగు రామలింగ రాజ్య మేలుచుండ వీరనప్రభువు సేనాధిపతియై, అన్నను గొలిచి యుండెను. ఇట్లుపాలించిన రామలింగక్ష్మాపతి కైదుగురు, రాజమౌళి, లక్ష్మీపతి, రాఘవయ్య, చంద్రమౌళి, వేంకయ్యప్రభుఁడు అనువారలు పుత్రులైరి. వీరిలోఁ బెద్దవాఁడైన రాజమౌళి, తన యనంతరము తనకు సంతతిలేమింజేసి, తన తరువాతితమ్ముని సింహాసనాసీనునిం జేసెను. ఇట్లు క్రమానుగతముగ రాజ్యలక్ష్మి రామలింగని నాలవకొడుకగు చంద్రమౌళిని వరించెను. ఈతని ప్రాభవమునుగూర్చి కవి యిట్లు పలుకుచున్నాఁడు—

"అతని ప్రభుత్వవేళను సమస్తనిదర్శమహోత్సవత్తనం
బగులితసార్వభౌమ బిరుదాంకితహూణ నృపాధికారసం
గతమయి క్రాలఁగాఁ దదధికారవశుండయి, యాతఁ డుర్వి కమ్మతగతి నేలెఁ దాఁ దనకు ముక్త్యపురం బది రాజధానిగాన్."

ఆచంద్రమౌళిభూకాంతుఁడు సుప్రసిద్ధ శివపూజాధురంధరుఁడగు చినవేంకటాద్రినిఁ గనినాఁడు. పిమ్మట నీ చినవేంకటాద్రినాయఁడు ముగ్గురుకొడుకులను గనెను. పెద్దవాఁడు భవానీముక్తీశ్వరప్రసాదనాయఁడు. చంద్రమౌళి రెండవవాఁడు. కనిష్ఠుఁడు సదాశివప్రసాదప్రభుఁడు. భవానీప్రసాదభూకాంతుఁడు చాలకాలము రాచఱికమనుభవించి, అనేకభూదానము లొసఁగి, రాజ్యము నిజసుతుఁడగు ఉమామహేశ్వరుని కైవసమొనర్చి, శివపూజాలగ్నమానసుఁడై విశ్రాంతి గైకొనెను. ద్రౌపదీపరిణయము నంకితముగొనిన దీయనయే. యనుసంగతి నీక్రిందిపద్యము చాటుచున్నది.—

"అల ద్రౌపదీపరిణయము
వెలయ మదుకృతి నొంది స్వీయంబగు చిం
తలపాటిగ్రామమునఁ గు
చ్చలమాన్యము నా కతం డొసంగె బహుమతిగాన్."

# బోసు పరిశోధనాలయ చిత్రములు



౧. సర్ జగదీశచంద్ర బోసుగారు, K. T., F. R. S., D. Sc.



౨. బోసుగారి పరిశోధనాలయము, కలకత్తా

ఎడమవైపున బోసుగారి గృహము. కుడివైపున పరిశోధనాలయము. ఈశాన్యముఖమునగల గడియారము లోపలగల మరియొక్క గడియారముతో విద్యుచ్ఛక్తిద్వారమున సంబంధము గలిగియున్నది.



౩. పరిశోధనాలయమునందలి పరిశోధకుల వసతిగృహము.



౪. పరిశోధనాలయ పశ్చాత్ప్రాంగణము.
ఇందు మొక్కలు, జంతువులు నిలువచేసిన భాగము లున్నవి.

# రామన్ పరిశోధనాలయ చిత్రములు



౧. రామన్ పరిశోధనాలయాంతర్భాగమున సర్ సి. వి. రామనుగారు



౨. రామన్ పరిశోధనాలయాంతర్భాగము
హిందూ విశ్వవిద్యాలయాధ్యాపకులు పోగానిగారి
'ఎక్సరే'లతో పరిశోధనము



3. రామన్ పరిశోధనాలయము, కలకత్తా

ఇంతటితో మొదటిశాఖయొక్క చరిత్ర ముగిసినది. కవియును, గ్రంథకర్తయు సమకాలికు లగుటవలన, నాపయిని చరిత్ర వర్ణించుటకు వీలుకాకపోయినది.

రెండవవంటున కధిపతియైన చౌదరిరామనక్షితిపతి రాఘవపురము ముఖ్యపట్టణముగాఁ జేసికొని రాజ్య మేలినాఁడు. అక్కాలమున నీతఁ డనేకధర్మకార్యముల నొనర్చెను. ఈరాజన్యునకు వీరపనేఁడు, రాఘవయ్య, చినపద్మనాభరాయఁడు, చంద్రమౌళి, రామలింగము, నారసింహప్రభృతు లను నార్వురుపుత్రు లుదయించిరి. జ్యేష్ఠుఁడగు వీరపనేనికి వీరశిరోమణియగు నారయ్యచౌదరి జన్మించి, తండ్రి యనంతరము రాజ్యాధిపత్య మొందెను. ఈతని రాజ్యపరిమితి యిట్లు వర్ణింపఁబడినది—

> " మంగళేమి నప్పువంబు గడిమన్న వశీరుల నోర్చి కొంచు న
> త్యంగణవదాన్యశీలయుగ మాత్మగనం బనుమండ ముస్తుబా
> న్నగరును ముస్తుబొమ్మగరు నాఁగల సమ్యగభివోభయుప్రత్త్రీ
> రనుదురతోపవర్తనము రాజ్యము నారయచేసె మన్నతిన్."

నారయ్యకుఁ గల్గిన యిరువురు కొడుకులలోఁ జినవరసన్న పెద్దవాఁడు. చినరామలింగం చిన్నవాఁడు. చినవరసన్న రణకుశలుఁడే కాక నీతికోవిదుఁడుగూడ నై యుండినాఁడు. ఇతనిపిదప నీతని యనుజుఁడు చినరామలింగభూపతి ప్రభుత వహించెను.

ఈచినరామలింగముయొక్క తారకు ద్వితీయసోదరుఁడైన చినపద్మనాభునియొక్క కథ యిట ప్రసంగవశమున వర్ణింపఁబడు చున్నది. ఈయన కొంత దేశము సంపాదింపఁగోరి హైదరాబాదు నవాబుగారిని దర్శించి, శ్రీవారిచే 'పెశాగ్గిరి' వడసి—

> " పాదుషాహీ మెహెర్బా నిట్లు గీల్కొల్పి
> 　చినపద్మనాభుఁ డింపెనయ, వేత
> నోలును, పెనుగంటిప్రోలు లోనైన నా
> 　నాసీమలకు జమీందారిపదవు,
> మన్నెవారీసమున్నతి, గణిదుర్గప
> 　తులచేఁ గొను వర్తదారిసనదు,
> తెల్లతెండా, పగల్దివ్వటీ, భూచక్ర-
> 　గొడుగు 1, నాప్తాగిరి, మానిసెలవు 2.
> 　అలఘుదేశముఖీపరువాజి పటహ
> 　హస్తితురగాది బహుమతు లలవడాబు
> 　వలనఁ గొనివచ్చి, పత్రంబు లలవరించి
> 　బ్రాహ్మణావనకారియై ప్రభుత సలిపె."

చినపద్మనాభము జైత్రయాత్ర గావించి, తన విరోధులగు వెలమలను రామరాజమంత్రిప్ప మొదలగువారినిఁ దునుమటయేగాక వారి కోటల దున్నించి, ఆముదపుగింజలు వేయించినాఁడట! స్వస్థానమునకు వచ్చిన పిదప నీతఁడు వైరిదుర్భేద్యమగు చింతపల్లికోటను గట్టించినాఁడు. ఈతనికి 'వెలిపద్మనాభ' మను వ్యవహారము కలదని యతని ప్రాప్తిం చినవిధమును గ్రంథకర్త యిటులు నుడువుచున్నాఁడు.—

> " ప్రణుతవదాన్యుఁ డాతఁడు శరన్నవరాత్రమహోత్రసార్చితా
> దనములఁ బోయు నాజ్యములు—ధారుణిఁ జేరి కరుళ్లుగట్టి, నె
> ట్టిన నదిపారలన్ నిలుపటన్ ఘటియించిరి, వెలిపద్మనా
> భనృపసమాహ్వయం బఖిలబాహుబు లన్నెఅ మన్నె తెంకిన్."

ఈచినపద్మనాభునకు సంతతిలేమి, యాతఁ డార్జించినదెల్ల నతని యన్నగారి మనుమఁడును, రాఘవపురమున కధిపతియునయిన చినమలింగప్రభువునకు సంక్రమించెను. అతనికిఁగూడ సంతతిలేమింజేసి, ఆతని రాజ్య మంతయును, అనఁగా రెండవవంటయిన రాఘవపురీ జమీ యావత్తును, మూఁడవవంటుదారైన రాఘవయ్యగారి వంశీయు లకుఁ జేరిపోయెను.

మూఁడవవంటయిన మాగల్లుచేకొనిన రాఘవయ్యకథ యిట్లు వర్ణింపఁబడియున్నది. ఈరాఘవయ్యకుఁ జెదపద్మనాభనాయఁడను పుత్రుఁ డుదయించి సకలజనానుమోదియు, ధర్మకార్యనిరతుఁడు నై, అనేకభూదానము లొనర్చినాఁడు. ఈయనకుఁ జినరాఘవయ్య, చంద్రమౌళి, నాగన్నచౌదరి, రామన్న, లక్ష్మీపతి, బుచ్చన్న ప్రభువు లను నార్వురు పుత్రులు గల్గిరి. వీరిలోఁ బెద్దవాఁడు రాజ్య మేలినపిదప జ్యేష్ఠకనిష్ఠన్యాయ మనుసరించి క్రమేణ నాగన్న ప్రభు వాయెను. అతనికి రామన్న, జగ్గన, నాయఁడమ్మ * అను ముగ్గురు సుతు లుదయించిరి. జ్యేష్ఠుఁడగు రామన్నప్రభువునకు పాపయాఖ్యుఁ డగు పుత్రుఁడును వానికి రామానాయఁడు, రామనాథబాబు అను కుమారయుగ్మకమును జన్మించె. నాగన్నగారి నాయఁడమ్మగారికిఁ జంద్రమౌళియను సుతుఁ డుదయించి, యాతఁడు పిమ్మటఁ బద్మనాభ రామన్నగారు, జగన్నాథబాబు అను నిద్దఱు పుత్రులఁ గాంచెను.

నాయఁడమ్మగారికంటెఁ బెద్దవాఁడైన జగ్గనాయఁడు మిగుల శూరుఁడు కావుటంజేసి, కొన్ని జైత్రయాత్రలు సలిపి, అనేకసీమలఁ దన రాజ్యములోఁ గలిపికొనినాఁడు. ఈతని కాలమునాఁటికి రెండవ వంటుజమీగూడ వచ్చిచేరిపోయెను. ఈతఁడు నెఱజాణ. కవియొక్క జన్మస్థానమయిన బాలేమఱ్ఱగ్రహారము నొసంగిన దీప్రభూత్తముఁడే.

1. ఇట్టి ప్రయోగముయొక్క సాధుత్వము చింత్యము.
2. మాని సెలవు అనఁగా, మరణదండన విధించు నధికారము.

* ఇట్లు నాయఁడు శబ్దమునకు అమ్మ అనుపదము చేర్చి పేరు పెట్టుకొను నాచారము ఇప్పుడు గూడ మగవారిలో నున్నది. వాసిరెడ్డి వారిలో నిప్పుడును నాయఁడమ్మ అను ఆయన ఉన్నాఁడు.

ఈజగ్గయపేటసీమపతితో మహానుభావుఁడైన శ్రీ వేంకటాద్రినాయఁ డుదయించినది. ఈరాజచంద్రునిగూర్చి అధికముగాఁ జెప్పవలసినది లేదు. ఏలన,

"అతఁడు దండ్రివిఖ్యాతి యగువాఁడె, తన్మూర్తి
　యశము దిక్తటముల నలంకరించె;
అతఁడు విద్యాఖ్యాతి యగువాఁడె, తద్గుణా
　వళితన్ జ్ఞజిహ్వానివాసి యయ్యె;
అతఁడు భూసారికి వసించువాఁడె తన్మ
　హస్సు విద్వత్పుర్వ లక్షించె;
అతఁడు రాజ్యారంభి యగువాఁడె, తద్రిపు
　వ్రజ మటవీక్రమారంభి యయ్యె;
రాజమాత్రుండె? దివ్యవార్థక్రుతశతప
హాస్తవిస్ఫుటపదార్థ్యకాజ్ఞపవార్ధ్వి
తయవవేద్ధతె మన్నె సుల్తానుబిరుద
ముద్రితవిభూతతి వేంకటాద్రినృపతి".

ఈయన కృష్ణాతీరస్థము, గుంటూరుపురమున కనతిదూరస్థమునై వెలసి చరిత్రప్రసిద్ధమగు నమరావతీపట్టణమును దనకు ముఖ్యపట్టణముగాఁ జేసికొని ధరణి బాలించెను. ఈకమ్మకులమునం దుద్భవిల్లిన రాజోత్తములలో నీయన కెనయగువా రెవ్వరు లేరనియే చెప్పవలెను. సుప్రసిద్ధశివపూజాధురంధరుఁడగు నీప్రభువు దేవాలయముల కొనర్చిన సేవ అపారమయినది. శిథిలప్రాయములై మిక్కిలి హీనస్థితియం దున్న పెక్కు దేవాలయముల నుద్ధరించి, వానికి భూవసతి గల్పించి, తనజన్మము సార్థకము చేసికొనినాఁడు. ఇప్పటికిని గన్నులపండువుగ నీయనవిగ్రహము, అమరావతియందలి దేవాలయములోని గర్భగృహమున కెదురుగ నుండి, దేవదర్శనమునకు వచ్చువారల హృదయ మాకర్షించుచున్నది.

ఈయనప్రాభవ మింతింత యనరానట్టిది. ఈప్రభువుకాలము నాఁటికి విదర్భదేశ మంతయుఁ దురుష్కులచేతనుండి దాఁటి, పాశ్చాత్యులగు హూణుల (బ్రిటిషువారు) స్వాధీనమాయెను. వారివలన 'యిస్తిమిరార్' నొంది, శ్రీ వేంకటాద్రినాయఁడు తన జమీని బరిపాలించినాఁడు. ఈపద్యము గాంచుఁడి.—

"అష్టదుర్గాధిపత్యాంచితరతిపతి
　కాసికిగజపుటాచక్రవర్తి
జన్నెగట్టెడిగత్తె జట్టిమల్లుఁడు, మన్నె
　హంబీర బిరుదు రాజాధిరాజ
బిరుదు, రాజాబహాదరు మన్నె సుల్తాను,
　సరు * దేశముఖుమహాబిరుదు, రడ్డి
కర్ణాటనృపరమాకమనుండు, గడెగుర్గ
　గండరగండఁడు, కదనవిజయ
వీరశంకరబసవాంకితమన్నె
రాయపరరాజభీకరరాజచంద్ర
బిరుదుఁడై వేంకటాద్రిభూవిభుఁ డశేష
జనులు జయవెట్టఁ బ్రాజ్యరాజ్యం బొనర్చె."

ఈ నృపాలశేఖరుం డొనర్చిన దానధర్మము లసమానములు. "లలితసాలగ్రామలక్షదుం" డను బిరుదు సార్థకముగ "గోదానశ్రుగరాజు". "ప్రతిదినసంకల్పితవరాత్రత్రయాతిథి దంపతిపూజైక సత్కీర్తి" యనియు, "అఖిలపుణ్యక్షేత్రాధ్యాత్మ సత్రస్థాపి" యను పేరు వెలసిల్లినాఁ డీయన. ఒకానొకప్పు డీయన మత్స్యపురాణోక్తక్రమంబున హిరణ్యగర్భమహాదానం గావించి, అధర్మ...ప్రోక్షణచేసి, అర్థులకుఁ బంచియిచ్చినాఁడు. ఈయన యీవి నెంతని కొనియాడఁగలరు!

"పరసులపాలికీవనము, సంతత మర్థులకొంగుముల్లె, భూ
సురకవిరాజకుద్భుతసదన్ననిధానము, మిత్రపాలికిన్
ధరితవనూత్కరంబు, పరపంక్తికి నిష్కంటకల్పకంబు భో
స్థిరముగ వేంకటాద్రివరదేవశిఖామణియాని; మాయురే!"

ఈప్రభూత్తముని యెంతెంత వర్ణించినను దనివి తీఱదు. ఇన్నిపలుకు లేల?

"సుమనస్తతి సుమనోభ్యాం
దమునుడాయన్నవి క్లప్తాః; నందనము నందన; న
య్యమరావతి అమరావతి;
అమరేంద్రుఁడు వేంకటాద్రిరాయఁడె యతఁ డలరెన్."

ఇట్టితీతి పనులై శ్వర్యభోగంబులఁ దులఁదూఁగుచుండిన యీ నృపశేఖరున కనపత్యచింత యొకటి గాటముగ వలముకొనినది. కావుట్టి కొంతవఱకు హితులను తజ్ఞులతో నాలోచించి, తన పితృవ్యుల పౌత్రులను జగన్నాథబాబు రామనాథబాబుగారలను వరుసఁగ దన పెద్దభార్యకును, ద్వితీయభార్యకును దత్తత నలకరించినాఁడు. మృదుని గజమాణిక్యములవలె నీపుత్రద్వయము తమఁజేరికొలుపఁ బెద్దకాలము నీసరణి జేలి, తుదకు "అస్త్ర్యబ్ధిచంద్రవసుసద్దేవ" హూణశకాబ్దమందు (1815 A. D.) నిర్యాణిక యాత్ర సాలించినాఁడు.

శ్రీ వేంకటాద్రినాయనియనంతరము జ్యేష్ఠపుత్రుఁ డగు జగన్నాథబాబు న్యాయలబ్ధమగు సింహాసన మధిష్ఠించి, లోకరంజకముగఁ బాలింపసాగెను. ఇంతలో శ్రీవాసిరెడ్డిసంస్థానసౌభాగ్యాకాశమునందు దురదృష్టమేఘము లలముకొన నారంభించినది. రాజుగారి సోదరుఁ డగు రామనాథబాబుహృదయసీమ నీర్ష్యానలము రగుల్కొనఁ జొచ్చినది. అన్నదమ్ముల కిరువురకీని విరోధము పుట్టించుట కిట్టితఱి యొప్పుడు

* 'సరు' అనునది ఇంగ్లీషులోని 'Sir' అను బిరుదమునకుఁ దెలుఁగు రూపము.

ప్రాప్తించునా యని కాచికొనియున్న దుర్మార్గులగు వారల కీయదను పండుగసమయ మయినది.

ఇఁకేమున్నది? ఇటువైపు కొందఱు, అటువైపు కొందఱు చేరి పురు లెక్కించినారు. క్రోధానలము మెండైనది. ఏకరీతిగాఁ బెరిఁగి శాఖోపశాఖలుగా విస్తరిల్లియున్న వాసిరెడ్డివంశమహావృక్షమునం దిట్టి మాత్సర్యమను పురువు ప్రవేశించినతర్వాత, ఆమహాతరువు క్రీలిపోవుటలో వింత యేమి? అభిమానధనులగు శ్రీ రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడుగారి దత్తపుత్రు లిరువురు దమ తగాదా పరిష్కరింపు మని ఆంగ్లప్రభుత్వమువారియందుఁ జేరినారు.

క్రమేణ, వ్యాజ్యపుగ్రంథము చిన్నచిన్న కోర్టులనుండి దాఁటి, పై మద్రాసు హైకోర్టుదాఁక నడచినది. క్రిందిన్యాయస్థానములలో గెల్పోటములు పరస్పరమయినను దుదకుఁ బ్రధానన్యాయస్థానమువారు జగన్నాథునికే జయలక్ష్మిని వశపఱచినారు. అంతట మరల సింహాసనారూఢుఁడై జగన్నాథబాబు నిర్విచారముగఁ బ్రాభవము సల్పుట కారంభించి, తండ్రికిఁ దగినకొడుకనిపించుకొని, ౧౮౨౫-వ సంవత్సరమున నాకము సేరఁబోయెను.

అన్న యిట్లు మృతినొందఁగానే, అపరిమితానందభరితుఁడై రామనాథబాబు సింహాసన మాక్రమించెను. కాని యెక్కువకాల మీయానంద మనుభవించుట విధి ఓర్వలేకపోయెను. పట్టుమని పది మాసము లాతఁడు రాజ్యపాలన మాచరించెనో లేదో, "లేటుజగన్నాథబాబు"గారి జ్యేష్ఠమహిషి, అచ్చమ్మగారడ్డుదగిలి, మరల వ్యాజ్యములోనికి దింపెను. ఇట్లు వీ రిరువురు రచ్చలకెక్కి పోరాడుచుండ, ద్వితీయభార్యయగు రంగమ్మగారు వీరిద్దఱి సహకరించి, తన దత్తపుత్రుఁడగు లక్ష్మీపతినాయనికే రాజ్యము రావలయునని తాను గూడఁ బోరాటములోనికి దిగినది. ఈవిధమున వీరు ముగ్వురు ధనవ్యయమెంతేని లెక్కసేయక, పరస్పరవిజిగీషువులై వాదోపవాదములు సల్పుచుండిరి.

ఇది యిట్లుండ, తగాదా పరిష్కరింపఁబడువఱకు సంస్థానము ప్రభుత్వమువారి 'తణిఖీ' క్రింద నుంపఁబడినది. ఇందువలన సరియైన నాథుఁడులేమి, రాజ్య మరాజక మాయెను. జగన్నాథుని జీవితాంతమువఱకు, పేష్కస్తీలో నొక్కపైసయైనను బాకీపడని వాసిరెడ్డివారిసంస్థాన మాభూకాంతునవంతరము, క్రమేణ ఋణగ్రస్తమాయెను. అయినవారసులు ముగ్వురు కోర్టులంబట్టి తిరుగుచుండ, సంస్థాననియుక్తులును, పైపరామరికకై నియుక్తమైన ఉద్యోగిగణమును జేరి, యెవరిచేతి కందినరీతిగా వారు దోచుకొనుటలో నాశ్చర్యమేమి? ఏయేఁటి కిస్తీ, ఆయేఁడు చెల్లఁబడకానందున, ప్రభుత్వమువారికి సంస్థాన మెంతయో బాకీపడెను.

"అయ్యోఽహ బహుధాచరితం
బయ్యోఁ బ్రభుత్వంబు, కుట్ర లనవరతము మెం
డయ్యెన్; మాంద్యగ్రస్తం
బయ్యెన్ దొరతనము; వెలితియయ్యెన్ బెట్టున్."

"ఆవాసిరెడ్డిరాష్ట్రము
వావిరి నక్కఱవువలన వైభవహీనం
బై వఱలె; నొర్వ లేయుని
చే వెసఁ బిల్వఁబడు తొంటిసింధుభుమాడ్కిన్."

ఇట్లుండ, మూలుగునక్కపైఁ దాటికాయ పడువిధమున, దేశములో దుర్భిక్ష మొకటి సంప్రాప్తించెను. దీనిచే విదర్భదేశమంతయు గగ్గోలువడి, నీరస మయిపోయెను. వివిధసంస్థానప్రభువులు 'జేచిరాకు' నందిరి. ఎల్లయెడల నాంగ్లప్రభుత్వమువారికిఁ జెల్లవలసిన పేష్కస్తీలట్టె నిలువఁబడిపోయినవి.

ఇట్టి విషమపరిస్థితులలోనే, ౧౮౩౧-వ సంవత్సరము మార్చి నెలలో హైకోర్టువారు వాసిరెడ్డివారి దావాను బరిష్కరించివైచిరి. అదృష్టవశమున రామనాథునికి మరల ప్రాభవము సల్పుభాగ్య మబ్బినది. కాని యీపర్యాయ మాతఁడు రాజైనను గాకున్నను నొకటియే యయ్యెను. ఏలయన నీతడవ నీయన పేరునకుమాత్రమే రాజు. ప్రభుత్వమువారి బాకీ చెల్లుబడియగుపర్యంతము ౧౨౦౦ రూపాయల మాసభృతిఁగైకొనుచు నీయనకు ప్రభుత్వమువారి నియుక్తునిభాతి రాజ్యము సేయవలసివచ్చినది.

ఎట్లయినను రాజ్యమనునది లభించెఁగదా యని సంతోషించి, రాజ్యపాలనము సాగించుచుండ, పితూరీకాం డ్రూరకుండలేకపోయిరి. రామనాథునిమీఁద లేనిపోని నేరములు గల్పించి గవర్నమెంటున కెఱుకపఱచిరి. దీనినిఁ గాంచి, సకలవిషయములు కూలంకషముగ విమర్శించి, యేయేసంస్థాన మెంతెంత చెల్లింపవలసియున్నదో అరసి నిర్ణయించుటకుఁగాను, సర్కారువా రొకవిచారణసంఘమును వాల్టర్ ఇలియాట్ (Walter Elliot) అనునాతని నాయకత్వముక్రింద నేర్పాటుచేసి పంపిరి. అంత నాకమిటీ వచ్చి, విచారించినట్లు విచారించి, పేష్కస్తీ యేమాత్రము చెల్ల నేరదనియు, సర్కారువారు సంస్థానములను దమక్రిందికిఁ దీసికొనుటయే మే లనియు, వాసిరెడ్డివారికుటుంబమున కొకలక్షరూప్యముల లవణసు (allowance) నేర్పాటుచేయవలయు ననియు రిపోర్టుచేసినది.

ఆహా! ఎంత సంభవించినది! తరతరములంగ వచ్చుచుండిన వాసిరెడ్డివారి ప్రాభవము, శ్రీ రాజా వాసిరెడ్డివేంకటాద్రినాయఁడు బహద్దర్ మన్నె సుల్తాను ప్రభువువారు సల్పిన దశశత గ్రామాధిపత్యము, కుంటెనకాండ్రమూలమునఁ బరప్రభుత్వముపాలైపోయినది. సంస్థానమంతయు గవర్నమెంటులోఁ గలసిపోయి, రామనాథప్రభృతులకు, సర్కారుదయానుసారముగ జీవనభృతి యేర్పడినది. చేయునది లేక, వారివారి "లవణసు"లఁ బుచ్చుకొనుచు వాసిరెడ్డివంగడమువారు కాలక్షేపము సేయుచుండిరి.

వ్యాజ్యములో మొదటఁ దనకుఁ బరాభవము కల్గినప్పుడు రామనాథ బాబు చేసిన ప్రసంగము భారతములోని

" దేవతల కైన నోర్చుక
రో వలయున కాదె క్రమముదపవిధికా
లావాప్తికి మను దమ స
ద్భావములననుసంచయించుకుంగఁబడియుండుటయున్."

విరాటపర్వము. ప్రథమా-౬౩ ప.

మొదలగు నీతిబోధకపద్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. పిలుకలికి నప్పుడెల్లఁ గవి నీతిబోధక మయినట్టివియు, జ్ఞానదాయక మయినట్టివియుఁ నగు ప్రసంగముల రచించియున్నాఁడు.

ఇట్లీ ప్రథమాశ్వాసమంతయు నర్థాలంకారములతోను, ముక్తపదగ్రస్తము, అనుప్రాసము, యమకము మున్నగు శబ్దాలంకారములతోను శోభిల్లుచున్నది. ద్వితీయాశ్వాస మన్ననో అట్లు కాదు. దీనికిఁ గారణము, తత్ప్రతిపాద్యమానవిషయభేదమే. ద్వితీయాశ్వాసమంతయు సంపూర్ణముగ వ్యవహారకాండము నవలంబించిన దైయున్నది. వ్యాజ్యము లాడుట, గెలుపోటములు, దుఃఖనివారణములు - ఇత్యాదివిషయములనే కవి యిందు వర్ణించియున్నాఁడు.

ఇట్లు న్యాయస్థానములయందలి వ్యవహారాదివిషయములు వర్ణింపఁబడియుండుటచే నీభాగమంతయు, వ్యావహారికపదసంకలితమై యొప్పుచున్నది. న్యాయశాస్త్రమునం దుపయోగింపఁబడు పారిభాషిక పదములు, వాని వికృతులు పలుతావుల వాడఁబడియున్నవి. ఇందుచే నిది యంతయు విలక్షణముగనున్నది. కలక్టరు, కోర్టు, బోర్డుమెంబరు, అన్నరు, లా, సమను, ఇంటరు, ఉయలు, నోటీసు మున్నగు నాంగ్లభాషావ్యావహారికపదములును, మరాఫా, కైస్తీ, దఖల్, గరీబు నూరత్-ఇత్యాది హిందూస్థానీశబ్దములును, పెక్కుచోట్ల నీకవి ప్రయోగించియున్నాఁడు. ఇదిగాక నొకటిరెండుచోట్ల 'సంబడము' 'వడితెరములు' మొదలగు ద్రావిడపదములు గూడఁ గాన్పించుచున్నవి.

కొన్ని విలక్షణములైన ప్రయోగములు గన్పించుచున్నవి. కొన్నిచోట్లఁ గర్త్రర్థమునందుఁ గర్మణిప్రయోగము, లౌకికవ్యవహారములోనిది, యీ యాశ్వాసములోనికిం జేరఁబడినది. 'వారు తీర్మానించిరి' అనుటకు, 'వారు తీర్మానింపఁబడిరి' అనియుఁ, 'సమనువచ్చిన' దనుటకు 'సమను రాఁబడినది.' అనియుఁ గొన్ని అనిష్టప్రయోగము లిందుఁ గానవచ్చుచున్నవి.

కొన్నిచోట్ల, 'మాలుకానిపని', 'బిట్టుకారిటి' ఇత్యాదివిలక్షణభూతపదసంయోగములు దృశ్యమానము లగుచున్నవి. లేఖకప్రమాదజనితదోషములేమో కాని కొన్ని స్ఖాలిత్యము లొకటిరెండుచోట్లఁ గంటఁబడుచున్నవి.—"అవశ్యముకర్తిగి", "నాయకి" ఇత్యాదులు. "వక్కా" అనుమాత్రము వైకల్పికముగాఁ బరిగ్రహించికొంటిమేని, కొన్నిరూపముల మగాగమరహితముగానే, "పొలుసు", "గడువుపు" మున్నగు వానినిఁ బ్రయోగించినాఁ డీకవి.

" ప్రమాదో ధీమతామపి " అన్నట్లు పొరఁబాటు లేరికైనను రాకమానవుగదా! దీనిమాట కేమిగాని, గ్రంథము మిక్కిలి చక్కఁగా రచింపఁబడియున్నది. కవితాధార అవర్గళమయి ప్రవహించుచున్నది.

సూరానిరెడ్డియమువలనఁ బ్రకృతము కమ్మకులచరిత్ర రచింపఁ బూనినవారల కెంతయో లాభము చేకూరఁగలదు. కొలఁదికాలములోనే యీగ్రంథము ముద్రింపఁబడవచ్చు నని నా నమ్మిక.

---

# వాసిరెడ్డి వంశావళి

(కవిగారు వర్ణించినట్లు వాసిరెడ్డి వారి వంశవృక్షము నిటఁ బొందుపరచుచున్నాము.)

- (మూలపురుషుఁడు) సదాశివనాయఁడు
  - శ్రీగిరి మల్లిఖార్జునుఁడు
    - వీరపనేఁడు
      - రాఘవయ్య (నాగంటి వంటుదారుఁడు)
        - పెద పద్మనాయఁడు
          - పెద రాఘవయ్య
          - చంద్రమౌళి
          - నాగన్న చౌదరి
            - రామన్న
              - పాపన్న
                - రామానాయఁడు
                - రామనాథబాబు (3)
            - జగ్గన్న
              - శ్రీవేంకటాద్రినాయఁడు బహద్దర్
                - జగన్నాథబాబు (2)
                  - లక్ష్మీపతినాయఁడు
                    - లక్ష్మీనృసింహ నాయఁడు (వాసిరెడ్డీయసంగ్రహకృతికర్త)
                - రామనాథబాబు (3)
            - నాయఁడమ్మ
              - చంద్రమౌళి
                - పద్మనాభరామన్న
                - జగన్నాథబాబు (2)
          - రామన్న
          - లక్ష్మీపతి
          - బుచ్చన్న ప్రభువు
      - చౌదరి రామన (రాఘవపురం వంటుదారుఁడు)
        - వీరపనేఁడు
          - నారయ్య చౌదరి
            - చినవరదన్న
            - చినరామలింగం (1)
        - రాఘవయ్య
        - చినపద్మనాభం (చింతపల్లి కోట నిర్మాత) (1)
        - చంద్రమౌళి
        - రామలింగం
        - నారసింహ ప్రభుఁడు
      - చంద్రమౌళి (చింతలపాటి వంటుదారుఁడు)
        - రాఘవయ్య
          - రాజమౌళి
            - శ్రీచంద్రమౌళి
              - రామలింగం
                - రాజమౌళి
                - లక్ష్మీపతి
                - రాఘవయ్య
                - చంద్రమౌళి
                  - చినవెంకటాద్రి నాయఁడు
                    - భవానీ ముక్తేశ్వరప్రసాదనాయఁడు (ద్రౌపదీపరిణయకర్త)
                    - చంద్రమౌళి
                    - సదాశివప్రసాద నాయఁడు
                - వెంకయ్య
              - వీరన్న ప్రభువు
          - అచ్చన్న గారు

(1) కోటపద్మనాభుఁడను ఈ చినపద్మనాభగారికి సంతతి లేనందున, ఆయన ఆస్తియంతయు చినరామలింగమునకు చెందినది.

(2) వేంకటాద్రినాయఁడుగారి పినతండ్రి పౌత్రుఁడగు జగన్నాథబాబు మొదట దత్తపుత్రుఁడుగా గ్రహింపఁబడెను.

(3) పైవారి పెదతండ్రికొడుకగు రామనాథబాబు వేంకటాద్రినాయని ద్వితీయపుత్రుఁ డాయెను. ఇందులకు వారల పరస్పరమనోభేదమే కారణము.

## తిరువాంకూరు చిత్రములు







1. అనంతపద్మనాభాలయద్వారము
2. వస్తుప్రదర్శనశాల
3. పురమందిరము
4. కోట, సింహద్వారము
5. పద్మతీర్థము, అనంతపద్మనాభాలయము







హిజ్ హైనెస్ శ్రీ పద్మనాభదాస వాంచిపాల రామవర్మ
కులశేఖర కిరీటపతి మన్నె సుల్తాన్ మహారాజరాజ రామరాజ బహదూర్ షంషేర్ జంగ్
తిరువాంకూరు మహారాజుగారు — జననము 7-11-1912, పట్టాభిషేకము 6-11-1931.



తిరువాంకూరు మహారాజుగారు, వారితల్లియు, సోదరియు, సోదరుడును

ఇందలి భావము మథింపఁబడిన సముద్రమువలె నతిగభీరమై యున్నది. పద్యమును దఱిసినకొలఁది లోకానందకరములగు పదార్థములు వెల్వడును. బుద్ధిని పాడిగించి లోఁదుగాఁ బంపినఁగాని 'ఘనపట్టు' మైన కవనస్వామిని సందర్శింప సంభవింపదు.

> "ఒకమఱి బుద్ధిగింప విలయోదకము ల్బయి కప్పి విప్పఁ ద
> చ్చకొని మహాభవీథిఁ జన నాకరత న్మొయి వెంది వెంటి క్రిం
> దికిఁ గయిద్రావాలు తళ్పులిల నిర్మలధార నదీపరస్ఫుర
> త్ప్రకృతికి నీయజాండమును బంగరుముంగరఁగా నొనర్పవే"

ఇం దగమ్యగోచర మగు ప్రకృతి కోశరూపము కలిగించి బ్రహ్మాండము నొకసామాన్యనాసాభరణముగ నొనరించి యమునాధార యను కాడచే నదికి లీలావిగ్రహస్వరూపుఁడగు దేవుని ప్రభావము దృగ్గోచరము చేసి కవి తన శేముషీప్రభావమును వెల్లడిచేయుచున్నాఁడు.

> "అనుపేంద్రాశయకుండికా చ్ఛదధిరవ్యావృష్టస్వచ్ఛాయఁ గాం
> చి సముద్యద్భ్రుకుటీసింహమత్సరమిళచ్ఛైవ్షక్ నదుర్దామదీ
> ర్ఘనపూర్ఘాటముఁ బెల్లగించుగతి సాంద్రశ్రేణిఁ గిన్కం చెరం
> జెకిట్రపాణిఖేదన్న భావభుబు ప్రాచు న్మద్యసంచానవా."

> "మునుము న్వైభవమూఱఁ దూఱుమఱికెంపు న్వ్రండెయుం దూఱఁ గం
> దనగాయుం గల నల్వుఁ దోఁప నఖకోణశ్రేణిచే విక్రమం
> బునవాఁ డుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీ తేజముం
> గొనుకీల న్వదలింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ."

> "బలిశిరోభయాంధకారభరిత బ్రహ్మాండగేహంబులో
> పలఁ బైమంజెనుశత్ప్రితాపమయదీపజ్వాల డిందఁ గ్గనం
> దలపై మింటికి గ్రక్కున న్నిగయు నవ్యత్రివ్యహోచ్ఛాయ నాఁ
> గలనీలాంగము కుంకుమార మెఱయంగాఁ జెంపవే వామనా."

కవి మరలఁ దనకుఁ బ్రియమగు నుత్ప్రేక్షాలంకారమును మొదటి పద్యమున భ్రాంతిమదనుప్రాణితము చేసి తిర్యక్ట్వంకుస్వభావమును జాటి రెండవపద్యమున స్వభావోక్త్యనుప్రాణితమును, మూఁడవదానియందు రూపకానుప్రాణితమును జేసి స్వకీయాద్వితీయవర్ణనాకౌశలమును భావగాంభీర్యమును జాటుచున్నాఁడు.

> "శమితక్షత్రియరక్తసేవితజలవర్ణాతేశ నీకీర్తిహం
> సము క్రౌంచస్ఫుటతావకాంబకపుహిం జాఁగంగ వీక్షించి వ
> క్షము రా వంచలు నంద నేఁడుఁ జన నిచ్చ న్నాటి తచ్ఛేష్ట వా
> యమిఁ దిర్యక్కృతి నా గతానుగతికం బోఁగా భృగూత్తమ హరీ."

పరశురాముని క్రౌంచపర్వతభేదనమంతి సత్యమే యైనాఁగాని కవియను నీరాజహంస తన కీర్తిహంసముచే తద్భేదన మొనరించి యితరకవిహంసలకు మానససరోవరంబయి యాపద్యముచే దిర్యగ్గాతిలక్షణమును దెలిపి తనకుఁగల ప్రకృతిపరిశీలనజ్ఞానమును స్పష్టపఱచుచున్నాఁడు.

> "పవిధారాపతనంబుఁ గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
> తువులం దూఱఁ బరిశ్రమంబునకు మద్యోగించె నా సప్తసా
> లవిభేదం బొనరించి నిల్వక వెసం - బన్నట్టి యమ్మన్మరు
> జ్జవనాస్త్రంబు భోసఁగు న్నిరత్ రఘుకులస్వామీ, రమావల్లభా."

ఆహా! కవిచాతుర్యము! కిష్కింధాప్రాంతమందలి సప్తసాలము లెక్కడ? రావణునిదేహాస్థితము లగు సప్తధాతువు లెక్కడ? ఇత్యాది శత్రుమారణ మొనర్చుటకు ముందు కృష్ణదేవరాయలు చేయు పరిశ్రమమును సూచించుచున్నది.

> "స్యందనస్థితబిడౌజుకృత్యాజాత్యశ్వ,
> జ్జంరుఘామరుద్గతి జ్జ్వాళ్ళత్కృతములు,
> క్రవ్యాశిరాడ్గాత్ర కవచస్ఫుగ్గానాన,
> స్ఫుటశల్యహవ్యభుగ్వ్యాత్కృతములు,
> యోధనవిర్మితవ్యగ్న్యటోత్క్రాంతనిజపాత,
> పాలాశక్రత్కృతమహాస్థానత్కృతములు,
> పతితోగ్రరక్షఃకబంధభారధృశార్తి
> భుగ్నభోగిఫణీంద్రఫూత్కృతములు,
> క్రాంతరక్షనిరంతరచ్ఛాయదములు
> దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు
> కలుషము లడంచుఁగాత లంకాపురాంగ
> ణాంబరచరత్కలంబకదంబకములు."

ఇత్యాది కఠినసంస్కృతపదభూయిష్ఠంబై యిట్టిపద్యములకు నాయకమణియై చూపట్టుచున్నది. ఇందలి పదములు బాణములవలె నల్లిబిల్లిగ నల్లుకొని కటువులై ధ్వనిచేతనే బాణవర్షమును వ్యక్తీకరించుచున్నవి. ఈ బాణముల స్థితిని వీక్షించుటకు మన జ్ఞానచక్షువును నలుదిక్కుల బాణవేగమునఁ బరగించవలెను. ఆహో కవిబుద్ధినిశితత్వము!

> "క్షితి హాలకృష్టిఁ బుట్టి యవనంగా క్షితియందున సీత, యంచుఁ ద
> త్పతి విరహార్తి పొందిమనుఁ బోలిచి రామశరీర మెత్తి యీ
> క్షితి ఘనవ్రీయ నక్కుఁ దెందఁగాక కళిందజాతట
> క్షితి దున్నేటికి న్హలముచేతను నీకుఁ బళాత్కృత స్ప్రహరీ."

ఇందుఁ గవి కవితాకన్యను శ్లేషోత్ప్రేక్షచే నలంకరించి బలరాముని కృషిప్రయోజనమునకు వన్నెపెట్టి కర్షకుల కష్టమునకు లక్ష్మియే ఫలము గావున బలరాముఁడు లక్ష్మ్యంశసంభూతురాలగు సీతకొఱకే భూమిని దున్నినమాట రమణీయము. భూమిని దున్నువారికి లక్ష్మి ప్రసన్నురా లగుట వింతకాదు.

> "ఆయతయమునాదాకృతి కరాగ్రనగాంచలహాంతవారిధా
> -రాయుతచంద్రకాంతఫలకావళి బింబితయై వెలుంగ నా
> రాయణమూర్తి మత్కచరత్నముచేఁ బరిరతఁ గాంచె నా
> కోయదుపీర, వృష్టిఁ బని యూఁడినఁ బ్రోవవె సప్తరాత్రముల్."

ఇచ్చటఁ గవి నారాయణకవచప్రభావమును విశదీకరించుచు ననన్యసాధారణమగు కృష్ణవిగ్రహమును స్వాధీనముచేసికొని సర్వము తన్మయముగఁ జూచుచుఁ బాపులఁ దరింపఁజేయుచున్నాఁడు.

“తరుణత్వత్వరితాఘపంచకమునన్ దైత్యాబల్రేఁడై త
ద్వరసందోహము యమునాగ్ద్రాత్మకజలద్వ్యాగం బోకంట నైషక్
వ్వరఁ గావించితి వేటికో యహహా బుద్ధిం బరెయ్య నీభావ మ
ర్తరుణీకీలితసుత్ర మేటికి వసాగ్యం బొటఁగా కేశవా.”

“ఘనోరాపారమహాఘపంచకముఁ దెప్పల్లేయఁగా జేర్ప నా
ధారాపంచకభావనం బెలఁగుగంధర్వంబుఁ బ్రోక్కించు బ
లీరంభుస్నాతకాచు కీకటకరాశివారవాణీధవ
ద్రోహబ్రహ్మాంతకృపాణికాద్వితయవిద్యుద్దగ్రంథనిం గొల్చెదన్.”

ఇందలి కడపటి రెండుపాదము లక్ష్యగతులను ధ్వనింపఁజేయుచున్నవి. పంచమహాపాతకనాశనమునకై ధారాపంచకమును సమకూర్చుట కవినైపుణ్యము విశదమగును.

పైదశావతారపద్యములలో కవి తెలుపు వీరోచితములగు నాయకములను, నఖములను, ఖాణములను వర్ణించుచు వానినే స్మరించుట చూడ నితఁడే యొకరి ప్రమేయము సాహాయ్యము లేకయే యీగ్రంథము రచించె నని యూఢిగాఁ జెప్పుటకు వీలగుచున్నది.




గొప్పవారిని నాటకానికి పిలచినయెడల

# కవితాపరామర్శము

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

మన మనుకొనుపదములనే
మన వాడుకనున్న యర్థమర్యాదలనే
యను వెఱిఁగి కూర్చి జగముల
నొనరఁగ మోహింపఁజేయుచున్నారు కవుల్.

ఎఱుఁగఁజేతురు కవులు సాహిత్యవిజయ
ఘంట మ్రోఁగించి తమతమ ఘనయశంబు
గణన గావింత్రు ప్రాజ్ఞు లాగంటమ్రోఁగు
మ్రోఁతలంబట్టి తన్మూల్యముల దెలంగు.

తల్లి వాగ్దేవి వీథుల నెల్ల నింపె
రసవదుజ్జ్వలశబ్దార్థరత్నములను
విసువక రసైకదృష్టిచే వెదకుకవుల
నెవనికో గాని కన్పడ వవి య దేమొ!

పదములను గుదిగూర్చులే పద్యరచన
మనుచు మందుఁడు సంబర మందుఁ, గాలు
సేతులు కదల్చుమాత్రమే యీఁత యనుచు
ముదమున మునుంగు బాలుని చదురుతోఁప.

కందువ యెఱింగి పదములఁ బొందుపఱుచు
తెలివితేటలు లేని మూర్ఖులకుఁ దోఁచు
నర్థమును దుఃఖహేతువే, నిర్ధనునకు
వారక ఘటిల్లు పుత్త్రలాభంబువోలె.

పదము భవ్య మయ్యుఁ బ్రమదంబు నింపదు
చోటుగానిచోటఁ జొనుపఁబడినఁ
దరుణిముక్కుకొనకుఁ దగిలింపఁబడినట్టి
కళుకునిగ్గురవల కమ్మకరణి.

కావ్యశోభ నెల్లఁ గంగారు గావించు
ముక్కిడియగు పద మొక్కఁడైన
ముత్తియముల వరుసఁబోలు దంతముల సొం
పెల్లఁ జెఱచు గొగ్గిపల్లుపగిది.

ఒకటి నేఁ డెల్లి యొకటి యెల్లుండి యొకటి
గాఁగఁ బదముల నెట్టులో కలయఁగూర్చి
కకవికలుగాఁగఁ గడుఁ దికమకలుకుడిచి
యుప్పచప్పని పద్యంబుఁ జెప్పుఁ గుకవి.

స్థూలబుద్ధియైన దుష్కవినుడులును
స్థూలములె య టంచుఁ దోఁచు నాకుఁ
గాకయున్న నకట! గాఢయత్నంబున
నేని యవ్వి చెవుల కెక్కవేల?

వ్యంగ్యసౌరభ్యరసలసద్వాక్యసరణి
సుకవి యొనరించు నిందయు సుఖకరంబె,
కంపుగొట్టెడు కడునీరసంపు నుడుల
దుష్కవి యొనర్చు నుతియును దుఃఖకరమె.

సుకవులకు నెట్టిక్లేశమో కుకవులకును
అట్టిక్లేశమె; కొంత హెచ్చైన నగును
వేఁకటిమొదలుగాఁ బ్రసవించువఱకు
శ్రమము తుల్యమె దుష్పుత్త్రజననికైన.

ధాతకు జగంబుపై దయ తప్పె చనుఁకో?
భారతీదుర్మరణయోగమో? రసజ్ఞ
జనుల పాపమొ? యీమూఁటి సంఘటనమొ
కావలయు దుష్కవిత కాదికారణంబు.

బ్రహ్మహత్యకుసైతము పాచితంబు
నేర్పఱించిన ఋషు లదియేమొకాని
తెలియ దుష్కవితకు శుద్ధి పలుకరైరి
దానిఁ దలపెట్టుటకుఁగూడ తలఁకిరేమొ!

---

రమణీయోదయపర్వతాగ్రమున నుగ్రస్ఫూర్తి శ్రీకృష్ణరా
యమృగేంద్రుండు పరాక్రమస్ఫురణ నుద్యల్లీల లంఘింప భీ
తము పోనాడి తదద్రినాథుఁడు గజేంద్రస్వామి వేవేగ విం
ధ్యమహీభృద్భయదాటవీగమన మొందెన్ గగ్గె నంతేనియున్.

మొదల నుదయగిరిసమున్నతిం జేకొని - యవలఁ గొండవీటి కరిగి పిదప
జమ్మిలోయఁ బడుచు నెమ్మి బెల్లముకొండఁ - గొనె నృసింహకృష్ణకుంజరారి.

ధృతి నవలఁ గటకపతిగజ - పతికుంభవిదారణప్రథమహాశక్తికనం
తతికైతవవిజయరమా - పతిమతల్లీవిలాససంగతిఁ గాంచెన్.

విజయపురాధినాయకుఁడు వీరనృసింహకుమారరత్న మ
ద్గజపతివీరభద్రమహికాంతుని నాజి జయించి విస్ఫుర
ద్విజయరమాధురంధరతఁ జేకువఁ దక్షిణరాజ్యలక్ష్మి తోఁ
గజపతియానమై వెనుకొనెన్ మరలెన్ గజరాజకన్యతోన్.

ఆమీఁదఁ బటి తురంగమ - సామజబలయుక్తుఁడై విజాపుర రాజ్య
శ్రీమీఁది కరిగి రాచూ - ర్నామకదుర్గమును వశపఱచుకొనెఁ గడఁకన్.

అతఁడు దురుష్కవీర - వ్రాతమ్ముల నాజిఁ దునిమి రంభాసంభో
గాతతసౌఖ్యులఁ జేసెఁగదా! తగవరిగా నృసింహతనయుఁడు పోరన్.

విజయరమాయుక్తుం డగు - గజపత్యరి పొట్టునూరికడ నిల్పిన యా
విజయస్తంభము యాభూ - భుజుని యశోన్నతిని దెలుపుఁ బాలుపుగ నెపుడున్.

తిరుపతి కేఁగి వేంకటపతి న్నిజదైవము మ్రొక్కి నంత శ్రీ
గిరిపతి మల్లికార్జునుని గేవలభక్తి నమస్కరించు శ్రీ
వరు నల సింహశైలపతిఁ బాయక కొల్చు నమేశుఁ గాళహా
స్తిరమణు సేవసేయు నరసింహునికృష్ణుఁ డభేదభక్తితో.

అతఁడు తదీయదేవాలయములగుఱిచి - ద్రవ్య మెంతే నొసంగి నిర్మాణకృతులు
పొనరఁజేసి యశస్ఫూర్తిఁ భువిఁ దనర్చె - రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు.

విద్యారణ్యులచేఁ బ్రతిష్ఠితమునై విద్యావిశేషజ్ఞుఁడున్
బ్రోద్యత్కీర్తిరమాకరగ్రహణరమ్యుండైన శ్రీకృష్ణుచే
మాద్యద్విస్తృతి నొంది యెంతయును సామ్రాజ్యంబు నాఁ బొల్చి యా
విద్యానామకరాజధాని మహిఁ శోభిల్లెన్ సమభ్యున్నతిన్.

ఆంధ్రభాషామతల్లిభాగ్యంబుకలిమి - నవని శ్రీకృష్ణరాయాఖ్యుఁ డవతరించె
నాఁటి యున్నతి గలుగ దేనాఁటికైన - నాఁటి రారాజు గలుగఁ డేనాఁటికైన.

తల్లి! మాయాంధ్రభాషామతల్లి! యేల - కన్నదోయిని బహుబాష్పకణము లురల
నేడ్చెదవు కృష్ణరాయక్షితీంద్రుఁగూర్చి - కలరుగా మమ్మువంటి భక్తులు ధరిత్రి.

---



# ఇత్తడి పూసగంటము

కొత్తపల్లి సూర్యరావు గారు

ఏలర చిన్నవాఁడ చలియించెదు భీతిలి యాస్యపద్మముం
వ్రేలఁగవైచె దెయ్యయిన వింటివొ కంటివొ నన్ను భూతబే
తాళకులంబుఁ గాంచినటు తందరగొందువు ధైర్యమూను నా
లీలలు నేఁటి బాలకులు లేశ మెఱుంగరు విన్ము తెల్పెదన్.

అన విని యేర వింత యిదియా పలుకాడెదు, నిట్టిరూపు చూ
చినయది గాదు మున్నిటు వచించెడు యంత్రము లెన్ని లేవు, కూ
లినయిలు బోడిగోడ వెడలించిన దోఁచిన త్రుప్పటుక్కు—మే
కున కిటు గగ్గె వాక్స్ఫురి యకుంఠిత సిద్ధియు, దీని మాటలున్.

వినఁబడుఁ బెద్దగాఁ జెవికి విద్యుదుపాశ్రితతంత్రినుండి వ
చ్చినయది గ్రోలె నాకె, కడుఁ జిత్రము—కన్గొనువాఁడ దీనిఁ, జె
ప్పిన నొకనేఁడు జెప్పను భవిష్యదుదంతము చైత్యకప్రవృ
త్తిని—బలువింత చిత్రము నుఱింతును ని న్నిలువేల్పురీతిగన్.

కారణ మేమి యిట్టిట నొకండవ యున్కికి నెంతకాల మీ
మోరువరాని దుర్దశల నొంది వసించితి విష్టు నేను నీ
జేరక యున్న నే మగుదు చెప్పుము నీకలరూపు నాకు నీ
కేరహిఁ బాంధవంబు గల దేమొ యకారణబాంధవా యనన్.

ఏమినవించి తే మగుదు నించియు, నీ వరుదెంచి తీయఁగా
నీమెయి నొందు దైన మిటులే యొనరించును దీనికంటె నే
జేమి—యదృష్టవంతుఁడవు వృద్ధికి రాఁగలవాఁడ విట్టి నా
నోములపంటఁ గాంచితి నినుం గులవర్ధన యున్నినాఁడకున్

పిత్రుపైతామహమైన యి ల్విడిచి నీ పిన్నప్డు మాతామహో
ర్జితకు గ్రామముఁ జేరి తీవ్ర జననీప్రేరేపణన్ ; బుద్ధిహీ
న తదావాసముమీఁది ప్రేమమున మాన్యస్థానశైథిల్య మొ
ప్పి తెవుల్గొం టయి యాల్గె నచ్చటనె నీవే నిల్చి తాయింటికిన్.

స్వగృహం బెంతటి కష్టదాయి యయినన్ స్వైరప్రచారార్హ మ
న్యగృహం బైనను ఖేద మెంచికొనినన్ స్వావాససౌఖ్యంబు రా
దుగదా తిన్నను బస్తుపడ్డ నెటు లెందున్ స్వేచ్ఛ నీయింటిలో
మగమొ క్కొక్కటి యుండియుం గులము పే ర్మాయించె దుర్బుద్ధినై.

ఊరుం బేరును వన్నెవాసి ధన ముద్యోగంబు వాల్లభ్య మె
వ్వారు న్మెచ్చెడువారె కాని నిగసింప న్లేద యేస్వల్పసం
సారచ్ఛిద్రము సుబ్బనీక, పొడము న్నందీయ కెచ్చిల్లి ర
వ్వారి న్నే నెటు విస్మరింతును భవద్వంశీయులం బూర్వులన్.

మేడల మిద్దెల న్మనలి మేటులసంగతిఁ గూడి యూరిలో
వాడలవాడలం దిరిగి వాదులు దీఱిచి మధ్యవర్తితం
బ్రోడతనంబుఁ జూపి బహుభూముల గుత్తలు వ్రాసి తీసి వే
జాడల సంచరించితిని సజ్జనసేవ ననేకకాలమున్.

నా విని బాలుఁ డేమి యిది న న్నలఁగందఁగఁ జేయుమంటి నీ
వేవగ నాచరించితివొ వృద్ధసమాశ్రయ మబ్బి త్వద్వినో
దావహవృత్తి మె ట్లెఱుఁగనయ్యెదనో కరుణింపు మాత్మనం
శావళి దానఁ దేటపడునట్లుగ నున్నది వింతవస్తువా!

అన శైవాత్మక! వింతవస్తువును నేనా? యూపిరాద్రూపనే
ననము న్మాని నతారపూజనము సల్పంబోవున ట్లీరు నా
వెనుక న్వచ్చిన యుష్టిరార్థముల కీవిన్ లోఁగుటం బాలుమా
లి నను న్వింతగఁ జూడఁజొచ్చెదరు నే లేఖన్యభిఖ్యాతమున్.

తోమును నన్నుఁబట్టి పయిత్రుప్పు దోలంగఁగఁ గొంతకొంతగా
నామెయిరూపు తేటపడు నాపుడు నట్టులు చేసి చూచినన్
నా మపరంజివోలె మఱినామును జొక్కపుఁజొక్కమట్లుగా
నేమివచింప వింతలపయిం బలువింతె లటంచు నిట్లనున్.

వింతలు చూపుటం గడుఁ బ్రవీణుఁడ వట్టులు తోఁచు నిన్ను నే
నింతయు నెంచలేను వచియింపుము నీచరితంబు వింద నా
స్వాంతము వొంగ నావుడును సర్వక! నాతలమీఁది పేరు పీ
ఠించిదె? కాంతిపుంజ మటఁ జీకటి గ్రమ్మినఁ గానవయ్యెదన్.



కీ. శే. థామస్ ఆల్వా ఎడిసన్ గారు



కీ. శే. డా. కోకా అహోబలరావు నాయుడుగారు



కీ. శే. ఆవటూరి శివశాచలంగారు



కీ. శే. ప్రతివాది భయంకరం
రంగాచార్యులుగారు





కీ. శే. బి. టి. శ్రీనివాసయ్యంగారు



కీ. శే. చిట్టా అప్పలరాయుడుగారు

తేటిపాటంజూడు-తెలిసితి నేమది?, చదువు, "కృష్ణమూర్తిశాస్త్రిగంట"
మతని నెఱుంగు దేమొ యక్కజపుంగని, యెఱుంగ నెవండొ యమ్మహీసురుండు.

నీప్రపితామహుండ, యతనిం దలపించితి మంచివేళ నీ
కాప్రమదాశ్రు లౌనవి మదక్షుల దుఃఖపు వేడిబాష్పముల్
నే ప్రవహించుఁ జూచితె వివేకధనుండు మహాతపస్వి యా
విప్రుఁడు వాని వాక్యములు వేదములయ్యెను నాఁటివారికిన్.

ప్రభురీతి న్వచనాజ్ఞ నిచ్చుఁ బ్రజలం బ్రశ్నింపఁ డెవ్వాఁడుఁ ద
త్ప్రథ కష్టం బొకయింత లేదు విను లాభంబైన నష్టంబయే
ని భయం బందుచు రెండుపక్షములు మన్నించుం దదాజ్ఞావిధి
న్విభవాపేతుఁడు నప్రతిగ్రహుఁడు దుర్భేద్యుం డభేదాత్ముఁడున్.

నాచేఁ గావ్యములున్ శ్రుతిస్మృతిపురాణంబుల్ ప్రబంధేతిహా
సౌచిత్యప్రకటార్థశాస్త్రములు వ్రాయంజేసి మన్మూలక
ద్వాచాలత్వము శ్రోత్రపేయము సుకవ్యాహారము న్నించి యా
వాచస్పత్యభిరాము నీవలనఁ బ్రాప్తంబయ్యెఁ గీర్తింపఁగన్.

అనివార్య దోషము గాదు నే ననిన సత్యాసక్తి సన్మ్రొక్కుచుఁ గీ
ర్తన సేయున్ వ్యవహారవేళ, వలదా! రాద్ధాంతసిద్ధాంతముల్
విని వ్రాయ న్నియమంబు మాఱదది శీఘ్రం దేశదేశంబులం
దున నన్నందున ముట్టికొన్నరేఁడు భీతుం డన్యథావర్తిలన్.

ఇనుఁడే గంటము ముట్టుకో భయము తా నెట్టైన ముట్టంగఁ ద
ప్పనిచోట్లన్ గడి కేగు మేఁకవలెనే వానిచ్చి నాకేల నే
ననినం దప్పెడువాఁడనే విడుఁడు నన్నం చెట్టులో చేరు న
గ్గన భీతిల్లుఁ, గలండె యిప్పు డటులం గావించువాఁ డొక్కఁడేన్

కల్లలతోడఁ బుట్టుఁ గలకాలము మోసమె యెంచుఁ- జెప్పిన
ట్లెల్ల మెలంగఁ డప్పుకొని యిచ్చినపత్రము చేతివ్రాలు నేఁ
జెల్లను స్వల్పతిమం బను "రిజిస్టరు" చేసియు లేదు పొమ్మనుం
జల్లగ నిప్పు, డప్పుడను వచస్థితి మార్చెఁడు చాపుమూఁడినన్.

నీకుఁ బితామహుండు జననీజనకుల్ మృతి నొందఁ జేయుచున్
లోకుల మెప్పునంది తలలోపలి నాలుకవోలె నల్పసం
ఖ్యాకనెమంబుల న్విడిసె గర్భిణియై సతి యుండ నంత న
శ్వాకులుఁ డైన తండ్రి యతియత్నరతిం గోడలి రక్షసేయుఁగాన్.

నీజనకుండు పుట్టి రజనీకరవక్త్రుఁడు సోమయాజి వి
ద్యాజలజోద్భవుండు నను నాదర మొప్పఁగ మంచె దాతగా
రోజ నమస్తమందు బలియుం డయి వృద్ధుని గద్దెనుంచి తాఁ
బూజయొనర్చుచు న్నడపె భూములఁ బుట్టలు నార్జవంబునన్.

పుత్రుని మాటయు న్మగనిపోకయుఁ దాతకుఁ దల్లి కెన్నఁడే
మాత్రముఁ దోఁపకుండుగతి మానుగ సేవ యొనర్చుచుం దివా
రాత్రము లాజ్ఞయాజ్ఞయని రంజిలఁ జేయుచుఁ జేతులార స్వ
శ్వాత్రికు లైనవారికిఁ బ్రియ ల్నడపె న్విధివ న్ముదంబునన్.

కాలము మాఱిపోయినది కార్యము లెల్లను మాఱిపోయె న
క్కాలపువా రడంగిరి వికారము లుప్పతిలెం గ్రమంబుగా
శైలియు మాఱె నీపినయు జాయకు లోఁగి విచిత్రకార్యముల్
చాల నొనర్చెఁ గొన్నిటిని జ్ఞప్తికి వచ్చినవానిఁ దెల్పెదన్.

ఈవు కడుపునఁ బడిన దౌహిత్రుదవతియగు-నీజననికోర్కి-కై సోమయాజిగారు
చేసె స్థలభాండశుద్ధి యచ్చెరువుగాదె-స్త్రీవశుల చర్య లవి నాదు చిట్టివాఁడ!

ఏ మైపోయెనో తాతతీసుపును సద్వ్రాత్తంబు నుద్వేజ్య ప్ర
జ్ఞామేయత్వముఁ జూచువారికిని నాహా వ్రుట్టఁగాఁ జేసె నా
సామాన్యాకృతి నర్థహీనులకు నై సర్వంబు న ప్పచ్చుచుం
భూమార్గంబు కుసీదవృత్తి మెయిఁ బ్రోవుం జేయ నెంచెం గటా!

తాను బుచ్చుకొన్న ధన మిచ్చు కొనవచ్చె-నిలువఁబడిన పాట నిఖల మిచ్చి
గొన్నవార లీయకున్న నెత్తిని చేతు-లద్దెఁ గొన్నినాళ్లు తాతనికిని.

ఓనరసింహ! యేమనుదు నున్నది కొన్నది రెండుఁ బోయెఁ ద
న్మానినియన్న కొంత గొని నాశ మొనర్చెను సాలకత్వముం
బూని - కలర్థముం గుడువఁబోక సుఖంబుగ లేనిపోని వి
జ్ఞానముఖంబునం జెడి విశాలయశస్స్వ్యతిఁ దెచ్చికొందురే.

వచ్చినది తెచ్చికొని తినవలసినంత-గలదు రాఁబడి యత్యాశవలన మొదలుఁ
జెడియె నయ మింక నీకొంప విడిచెను సుడి-వోయియుండును బ్రదికినఁబూఁటలోన.

అట్టివాఁ డిట్టు లగుటమె యద్భుతంబు-లక్ష్మిచంచల యన్న వలదు విశేష
మేల యిటు వచ్చితివి నిన్ను నెట్లు విడిచె-మామ పొరుగూరు రాఁ జెప్పమా యొకింత.

తాతపేరిటివాఁడ వుత్తముఁడవు ప్రపి - తామహునికై పడియుఁ దల్లి మోమువాఁడ
పట్టి నినుఁ జూడఁగల్గినో వత్స, నన్నుఁ - గనఁగవచ్చితివేమి భాగ్యంబు కలిమి.

నీవె చెప్పితి వంతయు నేను దర్గ్స-హామున నిలువఁగ ననువులే దతని సతియు
"దిక్కు-మాలిన బాలుని దెచ్చి పెంచు-కొంటిమో"యని నన్గని గొణుఁగుకొనును.

ధన ముడివోవ నే మగుడు దల్లియుఁ జేరఁగనీదు-దానికై
పనివడి యిల్లు వీడి యిటు వచ్చితి నిక్కడ ముష్టి యెత్తుకొం
చును బడియుండ నోప్పఁగద పొంతము నాకిట బోడిగోడకై
నను-నినుఁ గాంచి నాకు నదనంబుగ ధైర్యము శౌర్య మొట్టెడున్.

బ్రాహ్మణుండ నిన్ని వత్సరంబులు తల-కెక్క- జందెము బుజ మెక్క-లేదు
గాన నీవు చెప్పఁగా వింటిఁ బితరుల-పేళ్లు మేనమామ వ్రేమ యిదిగో!

వత్స! భయంబు లేదు నిలువంబడియుండుము నాదుమాటపైఁ
గుత్సితవృత్తిఁ గాను నినుఁ గొందును నాసుతునట్లు నీకు నా
వత్సమయంబు గా దిది శుభంయువు సమ్మ శకంబు మాట నీ
వత్సర మెట్టు లుండునో శివా యని చేయుము మద్వచఃస్థితిన్.
మీపూర్వులకడ నేనే-యేపనిఁ జేసినను నేఁడు నేనే నీకై
వ్యాపారం బొనరించెద-వ్యాపాదముగాదు నమ్ముమా నామాటన్.
కవిలెఁ వ్రాసినయప్పనప్పు లవి చక్కఁబెట్టి మీతండ్రి, య
ట్టివి రాకుండ కృపాలదత్త మపుడట్లే చేసి నిక్షేప మా
వివరం బే నొకరుండ నేర్తుఁ దెలియన్ వీక్షించితిన్ గుర్తుగాఁ
దన దిప్పట్టున నెత్త, నూరఁగల పెద్దం జూడఁగాఁ బామ్మనా.

ఒక్క కుటీరము న్నిలిపి యొద్దిక చేయఁగఁ గోరు పూర్వపు
స్మక్కుఁవఁ బట్టి నీ కతఁడు మన్నన సాయముచేయు దానిపైఁ
జక్కఁబడు న్సమస్త మని జానుగఁ గార్యము చెప్పి యట్టులే
మిక్కిలి నేర్పుతో జరుప మెల్లగ నిట్లను గంట మంత్రటన్.

నన్నే నాఁడుబిఁకినట్టి వాటికి మత్తె - కొంకమీఁదఁ గుండగూఁడు గలదు
పూడ్చివేసినారు పోయి దానిని జూడు - నీకుఁ జెప్ప నదియు నియమవిధులు.
న న్నొక సాధనంబుగను నాసిది గోడను ద్రవ్యమయ్యు నే
నన్నిటి కన్నిరీతులను నయ్యెద నీకు సహాయభూతమై
యున్నను నట్లు చేయ నొక యన్నువచెంబున రూకలుం బదా
ర్వన్నెపసిండి తేప నొకపత్రముఁ గాంచెదు బాలుఁ డద్దిరా!

తాళపత్రమందుఁ దాఁ జేసినట్టి రహస్యగోపనంబు వర్ధి చెందు
టకును గుర్తులున్న నొకకొంతసేపు బాలకుఁడు తిచ్చవడి చలనముడక్క.

బాలుండా! యని యొక్కమాఱుగనె శ్రవ్యంబోకు, నానాటికిం
జాలింపందగు బుద్ధిహీనుఁడయి యమ్మన్నేదు నీతండ్రి యీ
నేలన్, రేకయు, బైటఁబడ్డయదిరా నీకంమ లేనవ్వున
న్మేలంబాడి గడించు దమ్మిడిని బేర్మిం గొమ్మనా దానిలోన్.

ననుఁ బూర్వార్జితమట్లు దాఁచికొను మన్న న్మేలు: నీమేలు నా
నెనరు న్వర్షశతంబు నొండొకటితో నేస్తంబు గావింపవే
నిను నాదైవము నెట్లు వాయుదును నానిర్వాహము న్నీవు చే
సి నిలంబెట్టితి లేనిచో నెటులు గాసింజెందఁగా నోదునో.

* * * * * * * * *

అదియే వెఱ్ఱియ ఓలు మూఁగ్యతము కార్యం బెట్లుఁ గాలానుసా
రదశం జెప్పను నిద్రపోవునతనిం బ్రత్యక్షమై లేపుఁ బో
వదు వ్యర్థంబుగ నేదియుం బ్రదుకుమీ ప్రాజ్ఞుండవై యెల్ల నే
న్మది రోజింపుము నావచస్సులను సంబంధంబు నానాటికిన్.

అని మానంబు భజించెన ట్లయిన నాహో యంచు గంటంబు ము
ట్టి నిజోరఃస్థలి నద్దుకొంచు నిల మంటి న్నీకృపాపారద్య
ష్టిని నే నెన్నఁడు నీదునాక్యముల వాసిం గాంతు దుర్మార్గమం
దున దుస్సంగతిఁ బోను వత్సరణి నుందు న్సజ్జనశ్లాఘ్యతన్.

నీవ ధనంబు నీవలన నేను మదన్వయుల న్మదీయభా
గ్యావహమార్గముం దెలిసి యుండితి మోదము, నీహితంబు నా
కీవహి సిద్ధమూ ఫలము నిచ్చెను జేతికి, బుద్ధిగల్గి మే
కో వెలపేల, నీవు పలుకు న్విరమించితి వేమి చెప్పుమా!

నే ననర్థప్రసంగంబు నేరఁ జేయ-నీకొఱకు వాక్కు నిల్పితిని మఱి నన్నుఁ
గదపకుము హాయిగానుండు కందునిన్ను-ననిన నటులుండె బాలుఁ డత్యాదరమున.

క్రమముగ నందఱిం గలసి గ్రామములోన మెలంగుచు, న్సమ
స్తముఁ గడు జాగరూకతఁ బ్రశస్తగతి న్వ్యవహరించి, బంధుబృం
దము గడియించి, మాతృసుతం గొని యత్తకు సిగ్గుదెచ్చి ది
వ్యమగు గృహస్థత న్మనియె నార్జన కొప్పుగ వెచ్చపెట్టుచున్.

ఆంధ్రపత్రిక - ఆంగీరస సంవత్సరాది సంచిక



కర్నాటక నవాబుల నగళ్లలో నొకభాగము (ఉత్తరపువైపు), చేపాకము, చెన్నపురి
(ప్రస్తుత మందు రెవిన్యూబోర్డు కార్యాలయము మున్నగు.)



# భారతరైతుఋణము

నుంకర సూర్యనారాయణగారు, బి. ఏ.

భారతదేశపురైతులు దుర్భరఋణములో మునిగియున్న విషయము జగద్విదితము. ఈక్రింది పరిస్థితులనుబట్టి రైతుల ఋణబాహుళ్య మెట్టివానికైనను గోచరింపగలదు.—

౧. పైరులు అతివృష్టి, అనావృష్టిదోషములచే ఒక సంవత్సరము ఫలింపకపోయినను రైతుకు బ్రతుకుశక్తి లేకుండుట.

౨. తాటియాకులతోను, రెల్లుతోను, గడ్డితోను కప్పబడిన అనారోగ్యకరములగు ఇండ్లలో నివసించుట.

౩. శీతకాలములో చలి నాపుటకైనను వలయునన్ని బట్టలు ధరింపలేకుండుట.

౪. నేయి, పాలు, పెరుగు మొదలగు సామాన్యభోజనవస్తువులనైనను నుపయోగించు ఆర్థికశక్తి లేకుండుటచే మిగులహీనమైన ఆహారమునే భుజించుచుండుట.

౫. బాలురకు ప్రాథమికవిద్య గరపించుటకైనను శక్తి లేకుండుట.

౬. ఋణముల తీర్పుటకుగాను రైతులు తమపొలములను ధనవంతులైన ఋణదాతలకు అమ్ముచుండుట.

## ౧. ఋణబాహుళ్యము

హిందూదేశమంతటను గల రైతుఋణమును అంచనా వేయు ప్రయత్న మేమియును జరుగనప్పటికి అక్కడక్కడ అప్పుడప్పుడు చేసిన విచారణలనుబట్టి యీసమస్య యెంత విచారకరమైనదో గ్రహింపగలము. ౧౮౭౫-వ సంవత్సరములో "డెక్కన్ అల్లరుల విచారణసంఘము" (The Deccan Riots Commission) వారు అహమదు నగరుజిల్లా (బొంబాయిరాజధాని) యందలి ౧౨ గ్రామముల ఆర్థికపరిస్థితులు పరిశీలించి, గవర్నమెంటుభూస్వాములలో మూడవవంతుమంది ఋణగ్రస్తులై యున్నారనియు, ఈఋణములు వారిశిస్తులకు ౧౮ రెట్లుండినవనియు, ఈ ఋణములలో మూడింట రెండువంతులు భూమి తనఖాఋణమనియు, సగటున ఒక్కొక్క భూస్వామికి ౩౭౧ రూపాయలచొప్పున ఋణ ముండినట్లును నివేదించియున్నారు.

౧౮౮౦-వ సంవత్సరములో క్షామ విచారణ సంఘము (The Famine Commission) వారు హిందూదేశమంతటనుండి చేరినసాక్ష్యమునుబట్టి భూస్వాములలో మూడవవంతుమంది తీర్పలేని ఋణములచే బాధనందుచున్నారనియు, ఇంకొ వంతమంది తీర్పగలిగిన ఋణములలో నున్నారనియు వ్రాసియున్నారు. ౧౮౯౫-వ సంవత్సరములో మద్రాసు రాజధానిగ్రామములలో ౪౫ కోట్ల ఋణమున్నట్లు సర్ ఫ్రెడరిక్ నికల్సను గారు(Sir Frederick Nicholson) అంచనా వేసియున్నారు. ఇటీవల గతసంవత్సరము విచారణచేసిన మద్రాసు 'బ్యాంకింగు విచారణ సంఘము' వారు(The Madras Banking Enquiry Committee) ఈరాజధానియందు ౧౫౦ కోట్లరూప్యములఋణ మున్నట్లు వ్రాయుచున్నారు. దీనినిబట్టి ౧౮౯౫-వ సంవత్సరమునుండి ౧౯౩౦-వ సంవత్సరమువరకును ౧౦౫ కోట్లరూప్యములఋణము చేసినదన్నమాట. ముప్పది యైదేండ్లలో మూడున్నరరెట్లుకు పెరిగినది. ఇప్పటికి మూడేండ్లక్రితము విచారణచేసిన కృష్ణా ఉభయగోదావరి, రైతు ఆర్థికవిచారణ సంఘమువారు ఈమూడు జిల్లాలలో ౨౫ కోట్ల ఋణ మున్నట్లు అంచనావేసియున్నారు. ఈలెక్కనుబట్టి మనమద్రాసురాజధానిలో కనీసము ౨౦౦ కోట్ల ఋణమైన నుండునని తలంచవచ్చును.

౧౯౦౧-వ సంవత్సరపు క్షామవిచారణసంఘమువారు (The Famine Commission) బొంబాయిరయితులలో నాల్గవవంతుమంది భూముల నోల్పోయినవారనియు, అయిదవవంతుకులోపు రయితులు ఋణము లేకుండ నుండిరనియు, మిగిలినవారు కొద్దిగనో, గొప్పగనో ఋణగ్రస్తులై యుండిరనియు తెల్పియున్నారు. నికల్సనుగారి మదరాసు అంచనా ననుసరించి ౧౯౧౧-వ సంవత్సరములో సర్ యెడ్వర్డు మేక్లెగను (Sir Edward M clagan) గారు హిందూదేశరయితుల ఋణము ౩౦౦ కోట్లు రూప్యములుగా అంచనావేసినారు. డార్లింగు

(Mr. Darling) గారు ౧౯౨౫-వ సంవత్సరపు పంజాబుఋణమును (౯౦కోట్లరూప్యములు) బట్టి బ్రిటిషుఇండియాలో ౬౦౦ కోట్లరూపాయల రయితులఋణ మున్నట్లు తేల్చి యున్నారు. ఆయన యిట్లు వ్రాయుచున్నారు.—"పంజాబుఅంతె (౯౦ కోట్లరూప్యములు) ఆ రాష్ట్రభూమిశిస్తుకు ౧౯ రెట్లు. ఈదామాషాను బ్రిటిషుయిండియాలో భూమిశిస్తుకు ౧౯రెట్లు-౬౭౪ కోట్ల రూపాయలఋణముండవలెను. కాని యితరరాష్ట్రములలోకన్న పంజాబులో పల్లెటూళ్లఋణములు హెచ్చుగానున్నట్లు ఈక్రిందిపరిస్థితులబట్టి గ్రహింపవచ్చును. జనసంఖ్యల దామాషానుచూచిన, పంజాబులో మిగత బ్రిటిషుఇండియాలోనున్న వడ్డీవ్యాపారులకు మూడురెట్లున్నట్లు తెలియుచున్నది. అదియును గాక రైతులను వడ్డీవ్యాపారులబారినుండి రక్షించుటకు పంజాబులో ప్రత్యేక మొకశాసన మేర్పరుపవలసివచ్చినది. కనుక భూమిశిస్తుకు ౧౯ రెట్లకుమారు ౧౬ రెట్ల వంతున ఋణమును గణించిన బ్రిటిషు ఇండియాలో ౬౦౩ కోట్లరూప్యముల ఋణ మున్నట్లు తేలును. భూమిశిస్తుశాశ్వతనిర్ణయ మున్నచోట్ల (Permanent Settlement) ఇతరచోట్లకన్న శిస్తు తక్కువగా ఉండుటచేతను, జమీందారులచే అనుభవింపబడుచున్న భూమిపన్ను పంజాబులెక్కలో చేర్చి ఇతరరాజధానులభూమిపన్ను లెక్కలో చేర్చక పోవుటచేతను ఋణపుమొత్తము ౬౦౩ కోట్ల రూప్యములకన్న నెక్కుడే యుండవచ్చును. జనసంఖ్యనుబట్టి చూచిన పంజాబుజనసంఖ్య బ్రిటిషుఇండియాజనసంఖ్యలో ౧౨-వ వంతు కాబట్టి బ్రిటిషుఇండియాఋణము మొత్తము పంజాబుఋణమునకు ౧౨ రెట్లు అనగా ౧౦౮౦ కోట్లరూప్యము లుండవలెను. కాన శాస్త్రీయముగా బ్రిటిషుఇండియాలోని ౨౫ కోట్లజనులకు ౬౦౦ కోట్ల ఋణమున్నట్లు చెప్పవచ్చును."

ఈఋణములో అత్యధికభాగము ప్రతిఫలశూన్యకార్యములకై వెచ్చించిన దగుటచేతనే యింతదుర్భరమైనది కాని జనసంఖ్య దామాషాను ఇంతకన్న హెచ్చుఋణముగల దేశములు లేకపోలేదు. పంజాబుఋణములో యిరువదియవవంతుమాత్రము ప్రతిఫలప్రదము లైన భూముల బాగుచేయుటకై వినియోగింపబడినట్లు డార్లింగుగారనుచున్నారు. ప్రతిఫలశూన్యములైన పనులకై వెచ్చించిన ఋణము తనంతట తానే పెరిగిపోవును. ప్రతిఫలప్రదమైన ఋణము భూబలమును వృద్ధిచేసి హెచ్చుఫల మొసంగి ఆహెచ్చుఫలముచే ఆఋణము తీరిపోవును. కాన రైతులు ఋణములు చేయునపుడు కడుజాగ్రతతో మెలగవలయును. ఋణము తెచ్చినపుడు ఆఋణమును కొద్దికాలములో తీర్చుటయేగాక, తెచ్చుకొన్న దాని ఆర్థికస్థితినికూడ బాగు పరచుకార్యమునకై వెచ్చింపబడిన గాని ప్రయోజనము లేదు.

## ౨. ఋణకారణములు

రైతులబీదతనమునకు ఋణము కారణమైనట్లే, రైతులఋణమునకును వారిబీదతనముకూడ కారణమే. కనుక రైతులఋణమునకు గలకారణములే చాలభాగము రైతుబీదతనమునకుకూడ వర్తించును.

౧. భూమిమీద జీవించుజనసంఖ్య అత్యధికముగానుండుట. మనదేశమున యంత్రపరిశ్రమ లేనియు బాగుగా వృద్ధికాంచక పోవుటచే అత్యధికజనులు భూమిసేద్యముచేతనే బ్రతుకుచున్నారు. అందుచే భూమినుండి ఒక్కొక్కరైతు పొందుఫలము తగ్గినది. జనసంఖ్య వృద్ధియగుచున్నను దానితోపాటు భూఫలసాయము వృద్ధికాకపోవుటచే భారతకర్షకులు నానాటికి బీద యగుచున్నారు.

౨. పొలములు ఖండఖండములయి ఒక్కచోటనే ఉండకపోవుట. అట్లుండుటచే—కంచెలు వేయుట కగుఖర్చు, గట్లకుగాను చాలభూమి వృథాయగుట, వ్యవసాయయంత్రములు మొదలగునవి చిన్నపొలములమీద నుపయోగింప వీలులేకుండుటచే వ్యవసాయపు ఖర్చు లెక్కువయగుట, ఒకపొలమునుండి మరియొకపొలమున కేగుటకగుకాలయాపనము మొదలుగాగల అనేకనష్టములచే రైతుపెట్టుబడికి తగినఆదాయము రాకుండును. వృథాగా పెట్టుబడి ఋణము వృద్ధియగు చున్నది.

౩. రైతు ఉపవృత్తులు లేమియు శ్రద్ధ లేకుండుట. సంవత్సరమున కొలదిమాసములు వ్యవసాయపుపను లుండవు. ఆతీరికకాలములో గృహపరిశ్రమ లేవైన నవలంబించి రైతు తన ఆర్థికస్థితిని చక్కబరచు కొనకపోవుటచే ఋణము తగ్గక హెచ్చుచునే యున్నది.

౪. రైతుయొక్క అనారోగ్యము. కొన్ని ఋతువులలో శీతజ్వరము మొదలగువ్యాధులచే రయితు వ్యవసాయపుపనులు చేయలేక పోవుటచే కూలియిచ్చి చేయించుచున్నారు. ఆరోగ్యము కలిగిన పిమ్మట కూడ ఆరోగి యొక్క దేహబలము చాలవరకు తగ్గియుండుటచే అతని అర్జనశక్తి తగ్గుచున్నది.

౫. అతివృష్టి, అనావృష్టి మొదలగుదోషములు. భారతదేశ వ్యవసాయము చాలవరకు శీతోష్ణపరిస్థితులపై నాధారపడి అతివృష్టి అనావృష్టిదోషములకు విస్తారముగా గురియగుచున్నది. అయిదు సంవత్సరములలో ఒకసంవత్సరము మంచిపంటలు పండుటయు, ఒకసంవత్సరము పొత్తుగా పండకపోవుటయు, మిగిలిన మూడుసంవత్సరములు సామాన్యపంటలు పండుటయు మనదేశమున తటస్థించుచున్నట్లు అంచనా వేయబడినది. అయిదుసంవత్సరములలో బాగుగా పండిన ఒక్క సంవత్సరమే రైతు ఋణముబారినుండి తప్పించుకొనుచున్నాడు. తక్కిన నాలుగుసంవత్సరములు రైతు ఋణముచేయవలసినదే. ఫలము

స్థిరము లేకపోవుటచే హిందూదేశవ్యవసాయము జూదమువంటిదని లోకోక్తి.

౬. రోగములవలనను వ్యాధులవలనను పశుమరణములు. మన దేశమున వ్యవసాయమునకు పశువులే యాధారము. దొమ్మ, చీడపాటు మొదలగువ్యాధులచే పశువు లపరిమితముగా మరణమొందుచున్నట్లు పశువుల కొనుగోలుకై సహకారసంఘములనుండి తీయు ఋణములబట్టి గ్రహింపవచ్చును. వరదలచే పాడైన ప్రదేశములలో పశువులకు మేత దొరకకపోవుటచే నవి విశేషముగా మరణించును. గతవత్సరము వరదలచే నష్టమైన బెంగాలురాజధానిలో మేత దొరకక పశువులు మరణించినవి. పశురోగములు, మరణములు హెచ్చినకొలది రైతు మరల పశువుల కొనుటకై హెచ్చుధనమును వెచ్చించి ఋణగ్రస్తు డగుచున్నాడు.

౭. వ్యాజ్యములు. ప్రస్తుతకాలమున మనరైతులు వ్యాజ్యములకొరకై చాలధనమును వెచ్చించుచున్నారు. జనులు విద్యావంతులైనకొలదిని క్రమక్రమముగా నీవ్యాజ్యములు తగ్గుట కవకాశమున్నది.

౮. రైతుల అజ్ఞానము, దూరదృష్టిలేమి, అతివ్యయము. రైతు అజ్ఞానముచే వ్యవసాయమున కుపయోగపడు నవీనపరికరములు వాడుట లేదు. వ్యవసాయము ఆధునిక నాగరికపద్ధతులపై సాగించి యెక్కువలాభమును పొందవచ్చును.

భారతకర్షకుడు దూరదృష్టి లేక మెలగుచుండుటవి లోకవిదితము. బాగుగా పండిన సంవత్సరపుపంటను పంటలులేనిసంవత్సరము నకు దాచిపెట్టుకొన జాలడు. తనఆదాయవ్యయపట్టికలను జాగ్రతతో వ్రాసికొనడు. ప్రతిఫలప్రదములైనట్టియు, ప్రతిఫలశూన్యములైనట్టియు వ్యయములను జాగ్రతగా పరిశీలించి మెలగడు. కులాచారముల వదల లేక శుభాశుభకార్యములకు అతివ్యయ మొనర్చును. ఇట్లు ధనమును ప్రతిఫలశూన్యములైన వివాహములు మొదలగు కార్యములకు వెచ్చించుటచేతనే యింత ఋణబాధ హెచ్చిన దనువాదమునకు 'డెక్కను అల్లరులవిచారణసంఘమువారు' (The Deccan Riots Commission) ఒప్పుకొనలేరు. కాని యీకార్యములకై చేసినఅప్పులవల్ల కూడ రైతులలో చాలమంది ఋణగ్రస్తులై పోవుచున్నట్లు మనము చూచుచున్నాము. కావున శుభాశుభకార్యములకు చేయు అతివ్యయముకూడ ఋణకారణములలో చాలముఖ్యమైనదియే యగును.

౯. పూర్వీకులఋణము. తండ్రినుండి కుమారునకు తరతరముల వారి సంక్రమించుఋణమే యిప్పటి మితిమీరినఋణమున కొకముఖ్య కారణమని 'డెక్కను అల్లరుల విచారణసంఘమువారు' (The Deccan Riots Commission) వ్రాసియున్నారు. న్యాయశాస్త్రప్రకారము కుమారుడు తండ్రిచేసిన ఋణమునకు తండ్రి వలనపొందినఆస్తియొక్క విలువవరకే జవాబుదారిగాని, తండ్రినుండి పొందిన ఆస్తికన్న ఋణమెక్కువగా నుండినచో కుమారుడు స్వార్జితధనముతో ఆమిగిలిన తండ్రిఋణమును తీర్చనక్కరలేదు. సామాన్యముగా మనరయితులు తండ్రిచేసిన ఋణమును ఆస్తియున్నను లేకపోయినను సరే తీర్చుట పవిత్రధర్మముగా నెంచి, దుర్భరఋణముచే క్రుంగిపోవుచున్నారు. రయితులకు న్యాయశాస్త్ర ధర్మములను నచ్చచెప్పి తండ్రియొసగిన ఆస్తికన్న ఋణమెక్కువున్నచో ఆ ఋణశేషమును తీర్చవలసిన బాధ్యత కుమారునకు లేదను న్యాయమును ఆచరణలో పెట్టునట్లు బోధింపవలెను. ప్రస్తుతపరిస్థితులలో రయితు ఋణములోనే పుట్టి, ఋణములోనే పెరిగి, ఋణములోనే మరణించుచున్నాడు. ఇట్టిపరిస్థితు లెంతత్వరలో మారిన నంతమంచిది. ఇందుకొరకు రయితుల కొక ప్రత్యేకమైన ఇన్సాల్వెన్సీచట్ట ముండవలెను.

౧౦. కృషీవలుని ఆర్థిక పరివర్తనము:. దేశపరిపాలనమున శాంతి యేర్పడుటవలనను భూమిపన్ను నిర్ణయింపబడుటవలనను, మార్గ సౌకర్యములు వృద్ధియగుటచేతను, ధాన్యపుధర లీమధ్య కొంతకాలము హెచ్చుటచేతను భూముధరలుకూడ హెచ్చి రైతు పరపతి హెచ్చినది. అందుచే భూమితనఖాఋణములు, తకరారుఋణములు పెరిగినవి. ఆర్థిక స్థితి బాగుపడుటతో నదే రయితు సుఖజీవనమునకభ్యాసపడును. కాని మరల ఆర్థికస్థితి చెడినపుడు జీవితవ్యయమును తగ్గించుకొనలేక ఋణము చేయును.

౧౧. ఋణదాత, వడ్డీవ్యాపారము:— బ్రిటిషు ప్రభుత్వము నకుపూర్వము వడ్డీవ్యాపార ముండినను అప్పటివడ్డీ వ్యాపారికి రెండు ఆటంకము లుండెడివి. అవి యేవన (i) ఋణదాత లపరిమితములైన వడ్డీలు వసూలుచేసినచో సంఘముచే దూషింపబడి నీచముగా చూడ బడెడివాడు. (ii) అప్పటిప్రభుత్వములు ఋణములను వసూలుచేసు కొనుటయందు ఋణదాతల కెక్కువ సహాయముచేసెడివారుకారు. అందుచే ఋణదాతలు పెద్దమనుష్యులు చెప్పినట్లు విని ఋణగ్రహీత లతో రాజీపడెడివారు. ఇప్పుడన్ననో, గ్రామసంఘజీవనమందలి పటుత్వము నశించుటచే ఋణదాత సంఘాభిప్రాయమునకు వెరచుటలేదు. అదియునుగాక ఇప్పటి న్యాయస్థానములు పత్రములబట్టి విచారించి ఋణములకు డిక్రీలు సులభముగా ఇచ్చుచున్నారు. అంతేకాని గ్రామ పరిస్థితుల విచారించి తమబుద్ధి విని యోగించి తగురీతిని ఋణపరిష్కారము చేయుట లేదు. ఇప్పటిరైతు మితిమీరిన వడ్డీరేటుచే క్రుంగిపోవుచున్నాడు.

౧౨. భూమిపన్ను. భూమిపన్ను నిర్ణయము, వసూలుచేయు విధానము రైతుఋణవృద్ధికి తోడ్పడుచున్నట్లు కే. టీ. ఆర్. సి. దత్తు గారు వ్రాసియున్నారు. క్రిందటియేబదిసంవత్సరములలో పలుచోట్ల వరదలచే పంటలు పండకపోవుటచే రైతులఆదాయము తగ్గినను భూమి పన్నుమాత్రము హెచ్చునట్లేయున్నట్లు తెలియుచున్నది. కాని రైతు ఋణములో భూమిపన్ను ౧౪-వ వంతుమాత్రమే యగుటచేతను,

నియమబద్ధములయిన విక్రయస్థలములను (Regulated Markets) స్థాపించి రైతు తనపంట నమ్ముకొనుటలో అనవసరమైన ఖర్చులను తగ్గించుటకు మన ప్రభుత్వమువా రెక్కువశ్రద్ధవహించినట్లు తోచదు. మొదటినుండియు మైసూరు మాత్రమే బొంబాయి, బెంగాలు, బీహారురాష్ట్రములవారు రెండుమూడుశాసనముల గావించిరి. మద్రాసురాజధానిలో కూడినయడల ప్రభుత్వమువారొక చట్టమును ప్రతిపాదింపదలచినట్లు ప్రకటించినారు. కాని ఆశాసనము వ్యాపారపుపంటలకు అనగా ప్రత్తి, మిర్చి, పొగాకు, వేరుసెనగ వగయిరా పంటలకే సంబంధించినది. వడ్లు మొదలయిన ఆహారధాన్యములకుకూడ నిట్టి సక్రమవిక్రయస్థలముల నేర్పరచు నవసరమెంతేని కలదు. మద్రాసురాజధానిలో వడ్లపంట యెక్కువ. వడ్లవిక్రయ సందర్భములందు రైతు లనుభవించు అన్యాయము సంతాపకరముగాన ప్రభుత్వమువా రీవిషయమై తగుశాసన మేర్పరుపవలయును.

భూమిపన్ను ఆర్థికశక్తిపరిస్థితులందు తగ్గించుటకు, తీసివేయుటకు గలయవకాశమును ప్రభుత్వమువా రుపయోగించుట లేదు.

స్వల్పవ్యయముతో సమాచారముల నడపుటకు వీలగునట్లు గ్రామములలో పోస్టాఫీసులను, స్వల్పాదాయములను వృద్ధిపరచుటకు పోస్టాఫీసు సేవింగ్సుబ్యాంకీలును ఉన్నవి. కాని ప్రస్తుతమున రైతులలో కొలదిమందిమాత్రమే యీసౌకర్యముల ననుభవించుచున్నారు. ఇప్పటికన్న తపాలసౌకర్యములు నాలుగైదురెట్లు వృద్ధియైనగాని రైతుజనసమూహమున కుపయోగము లేదు. ఇప్పుడు పోస్టాఫీసు ౧౦౫, ౩౦ మైళ్లదూరమున గలగ్రామము లనేకము లున్నవి. ప్రభుత్వము వారి తపాలశాఖ సంఘప్రయోజనసంస్థగా నుండవలెనుగాని ప్రస్తుతము మనప్రభుత్వమువారు దాని నొకవ్యాపారసంస్థగా జూచుట చిత్రము. కార్డు కాని, కవరు అర్ధణానుండి, కార్డుఅర్ధణా, కవరుఅణాకు హెచ్చించినప్పుడే రీనలకు చాలమందికి కష్ట మేర్పడగా యిప్పుడింకను తపాలరేట్లను హెచ్చించుట భావ్యము కాదు. రైతులలో మితవ్యయమును ప్రోత్సహించు నిట్టిసదుపాయములు ప్రభుత్వమువారు విరివిగా బీదల కుపయోగించునట్లుండజేయుట శ్రేయస్కరము.

## ii వ్యవసాయఋణముల గూర్చి న్యాయశాస్త్ర సంస్కరణము

ఒకశతాబ్దమునకు పూర్వము ఋణపత్రములబట్టియే న్యాయస్థానమువారు ఋణగ్రహీతలపై డిక్రీలు అమలుజరుపవలసియుండెను. ఇందుచే ఋణదాతలు రైతులయవసరమునుబట్టి ఋణపత్రముల నతికఠినపద్ధతులపై వ్రాయించుచు తమకొసగబడిన సౌకర్యములను రైతుల బేధించుటకై దుర్వినియోగపరచుటను ప్రభుత్వమువారు శీఘ్రముగనే గ్రహించి ఋణదాతల కొసగిన యాయుధములను తిరిగి లాగికొన మొదలిడిరి. నిర్దాక్షిణ్యమును, నిష్పక్షపాతమును, కఠినమును నైన ఆనాటి న్యాయశాస్త్రములకు మారు సామాన్యమ నవసరదృష్టితో వివేకమైన న్యాయము నొసగవలసిన యావశ్యకత గ్రహింపబడెను. ఇందుచే ఋణదాతలు ధర్మసమ్మతముగా రావలసినధనమును కోల్పోవ చేసిన రైతులకు పరపతి పుట్టదు. అది ధర్మమును గాదు. కావున నీవిషయమున న్యాయాధికారులు కడు జాగ్రత్తదృష్టితో మెలగవలయును. రైతులు ఋణదాతల నిరంకుశకఠిన విధానములనుండి రక్షింపబడవలెను. కాని వారు ఋణదాతలకు ధర్మముగా నివ్వవలసిన, యివ్వగలిగినవరకు ఋణము తీర్చునట్లు చేయవలెను.

రైతురక్షణార్థమై సివిల్ ప్రొసీజరుకోడు (Civil Procedure Code) రైతులపై డిక్రీల నమలుజరుపుసందర్భములందు కొన్ని మార్పులు గావింపబడెను. అందుచే వ్యవసాయోపకరణములను, నేద్యమునకు వలయు పశువులను, కర్షకుని గృహసామగ్రి ఋణమును తీర్చుటకై కోర్టువారు జప్తుచేయుటగాని విక్రయించుటగాని న్యాయశాస్త్రసమ్మతము కాదు. అదియునుగాక ఋణగ్రస్తుడైన రైతు తనఋణమును వాయిదాలపద్ధతులలో తీర్చుకొను సౌకర్యమును పొందు నవకాశము కలదు. ౧౮౭౫-వ సంవత్సరములో దక్కనులోని కొన్ని గ్రామములలో ఋణదాతలపై ఋణగ్రహీతలు తిరుగబడుట మొదలగు అల్లరుల విచారణకై నియమింపబడిన సంఘమువారి (The Deccan Riots Commission) సలహా ననుసరించి ౧౮౭౯-వ సంవత్సరములో 'దక్కను రైతుసహాయశాసనము' (The Deccan Agriculturists' Relief Act) గావింపబడెను. ఈశాసనముప్రకారము న్యాయాధిపతులకు ఋణపత్రములనిగారి రైతు కుపయోగములనటుల దుర్భరమైన వడ్డీరేటును తగ్గించుటకును, స్పష్టముగా తనఖాయుంచినగాని భూమి ఋణదాతకు సంక్రమించకుండ జేయుటకును, కొన్నిసందర్భములలో క్రయపత్రమున్న భూమినైనను ఋణదాతలనుండి రైతుకు తిరిగి యిప్పించుటకును అధికార మొసగబడెను.

ఈశాసనమువల్లనే ఋణదాతలు క్రమమైన ఖాతాలనువ్రాసి ఋణగ్రహీతల కనుపరచుటకును, ఋణగ్రహీతలు చెల్లించినమొత్తములకు సొమ్ము ముట్టినట్లు రశీదు లిచ్చుటకును నియమము లేర్పడెను. రైతులభూమితనఖా లిఖితపూర్వకముగా నుండవలసినట్లు శాసింపబడెను. ౧౮౫౯ నుండి మూడుసంవత్సరములుగా నుండిన 'ఋణపత్రజీవితకాలము' (Period of Limitation) రిజిష్టరయిన పత్రములకు ౧౨ సంవత్సరములవరకును, రిజిష్టరు కానివాటికి ౬ సంవత్సరములవరకును పొడిగింపబడెను. ఈశాసనము సదుద్దేశ్యముతో గావింపబడినప్పటికిని, ఆచరణయందది నిష్ప్రయోజనమై హానికరముగకూడ పరిణమించినది. దీనివలన వ్యాజ్యము లెక్కువయైనవి; రైతులు సాహుకార్ల మధ్య పరస్పరసందేహములును, అస్థిరత్వమును వృద్ధియై సామాన్యపరపతికి భంగము కలిగినది. ఈశాసనముద్వారా రైతుల కొసగబడిన సదుపాయములను వారు దుర్వినియోగపరచుటవలనసాహుకార్లు తమవడ్డీ వ్యాపారములో మిగుల జాగ్రతగాను, కట్టుదిట్టముగాను మెలగుటచే అప్పుకొరకుట కష్టమయినది. 'వ్యవసా

యకును' అనుసరమున కొనసగిన విశాలార్థములలన న్యాయముగా నీశాసనపు సౌకర్యముల బడయుటకు రైతులు వారు కూడ ఈశాసనమును దుర్వినియోగపరచుచు నిష్కపటులైన ఋణదాతలను న్యాయస్థానముల కీడ్చి వారి బాధింప నవకాశము కలిగినది. ౧౯౦౧ సం||రపు 'క్షామ విచారణసంఘము' వారి యభిప్రాయ ననుసరించి ఈశాసనానంతరము తనఖామూలమునను, విక్రయమూలమునను భూమి అన్యాక్రాంత మగుట హెచ్చినదని నమ్ముటకు కారణము న్నది. కొలదికాలము క్రితమే బొంబాయి ప్రభుత్వ సంఘమువారు ఈశాసనమునకు కొన్ని ముఖ్యమైన సంస్కరణములను సూచించిరి. శ్రీయుత్ కె. యస్. గుప్తగారు (Mr. K. S. Gup a) 'ప్రభుత్వవ్యవసాయవిచారణ సంఘము'వారికి కొనసగిన వ్రాతమూలకపు అభిప్రాయములో కూడ నీశాసనసంస్కరణ విషయమై తెల్పియున్నారు. చాలమంది తెల్పిన యభిప్రాయమునుబట్టి 'బొంబాయిరాష్ట్ర బ్యాంకింగు విచారణసంఘము' (The Bombay Provincial Banking Enquiry Committee) కూడ నీశాసన సంస్కరణావశ్యకతను సూచించిరి. న్యాయస్థానమువారికి దుష్కర ఋణపత్రములనుండి రైతును కాపాడుటకు స్వతంత్రమైన యధికార ముండుటచేతను, ౧౯౧౮ సం|| రమున వడ్డీవ్యాపారమునుగూర్చి గావింపబడిన యొక శాసనము (The Usurious Loans Act) ఉండుటవలనను, ఈ 'దక్కను రయితు సాహాయ్యక శాసనము' (The Deccan Agriculturists' Relief Act) అనవసరమని పలుకు రభిప్రాయ మొసగిరి.

'కంట్రాక్టు ఆక్టు' కు ౧౮౯౯ సం|| రములో నొకముఖ్యమైన సవరణ గావింపబడెను. ఎట్లన, ఋణదాతలు తమకుగల ప్రత్యేక సౌకర్యములు, పలుకుబడిని వినియోగించి ఋణగ్రహీతల కేవిధమైన కఠినపరతులు నియమింపకుండినట్లు ఋజువుచేయవలసిన బాధ్యత ఋణదాతపైననే మోపబడెను.

౧౯౧౮ సం|| రమున నవరింపబడిన ప్రకారము, 'వడ్డీవ్యాపార శాసనము' (The Usurious Loans Act) ఒక్కసారిగా ఋణదాత ఋణగ్రహీతనుండి పొందదగిన వడ్డీమొత్తపు పరిమితిని, న్యాయశాస్త్రరీత్యా విధింపదగిన వడ్డీరేటు పరిమితిని నిర్ణయించుచున్నది. 'ప్రభుత్వ విచారణసంఘమువారు' (The Royal Agricultural Commission, ౧౯౨౮) తమ నివేదికలో (౩౬౫-వ పేరాలో) నీ శాసనమునుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు.—"ఈ శాసనపుముఖ్య లక్షణ మొకటి యేమనగా, ఒకసారి న్యాయస్థానమువా రొకవ్యాజ్యమును చేపట్టినపుడు, ఇంక వారు దానికి సంబంధించిన యావత్తు వ్రాతలావాదేవీలను, పత్రములను, దస్తావేజులను, యెవరును కోరక పోయినను తమయుద్దేశ్యము ప్రకారము తెప్పించి యాఋణమునకుసంబంధించిన ధర్మాధర్మ్యములను విచారింపవచ్చును. తనఖాపత్రపు ఇరుకక్షులలో నెవరైనను న్యాయస్థానసాహాయ్యము పేక్షించి తెచ్చిన వ్యాజ్యమునకుకూడ నీశాసనము వర్తించుచున్నట్లే ది ౧౯౨౬ సం||రమున సవరింపబడినది. ఋణము తనఖాఆధారములేనిదైనను, ఋణగ్రహీత కాలదోష మువట్టియున్న ఋణమునకు తిరుగ పత్రము వ్రాయ తిరస్కరించిన మాత్రముననే, ఋణదాతను న్యాయస్థానమునకు రప్పించి తద్వారా ఈశాసనమును వర్తింపజేయవచ్చును." ఆసంఘమువారు ఈశాసన మేరాజధానిలోను ఆచరణమందు లేదనియు, అందుకు కారణముల కనుగొని యీశాసనము ఆచరణయందుంచుటకు వలయు ప్రయత్నముల ఋణదాతలు చేయవలెననియు చెప్పిరి. వారు "పంజాబు ఋణదాతలబిల్లు"ను (The Punjab Mo ey lenders' Bil), "బ్రిటీషుఋణదాతల శాసనము"ను (The Britis Money lenders' Act 1927) కూడ రాష్ట్ర ప్రభుత్వములకు ఆచరణయోగ్యముగ సూచించిరి. పంజాబు బిల్లుయుద్దేశ్యము ఋణదాతలు సక్రమమైన ఖాతాలు వ్రాయుటయును, ఋణగ్రహీతలకు ప్రతియారుమాసములకును వారివారిఖాతాల ఋణస్థితి నకళ్ల నొసగుటయును, బ్రిటీషుశాసనోద్దేశము ఋణదాతలు తమవ్యాపారమునకు 'లైసెన్సు' పొందుట, పాలుసరివడ్డీని షేధము, ఋణగ్రహీతకొరకు వానిఋణసంబంధమైన సమస్త విషయములను, పత్రముల నకళ్లను ఋణదాత లొసగుట, సహకారపరపతి వ్యాపించుచుండుటచేతను, ప్రస్తుతము ఋణమొసగుటకై ఉపయోగింపబడుచున్న ధన మెట్లయిన వినియోగింపబడవలసియుండుటచేతను, ఇట్టిశాసనములవల్ల పరపతి తగ్గిపోవునవకాశము లేదని 'వ్యవసాయ విచారణసంఘము'వారి (The Royal Agricultural Commission 1928) యభిప్రాయముకాని దార్లింగుగా రిట్టిశాసనము లమలు జరుపుట కష్టమనియు, మరియు నవి ప్రస్తుతకాలమున అనవసరములనియు భావించిరి.

## iii. భూమిని అన్యాక్రాంత మొనరించుటను సంకుచితపరచు యత్నములు

౧౯ శతాబ్దపు కడపటిసంవత్సరములలో భూములధర లధికముగా హెచ్చినవి. అందుచే రైతులు అవివేకముగా ప్రతిఫలశూన్యఋణములు చేసి తన్నివారణార్థమై భూముల గోల్పోవజొచ్చిరి. ఋణగ్రస్తులయిన రయితు లిట్లు భూముల ఋణదాతలకు విక్రయించుటచే భూములు ధనవంతులకు సంక్రమించుననియు, వారు ధనమును వెచ్చించి భూములఫలసారము వృద్ధిపరచెదరనియు తలచి ప్రభుత్వమువా రిట్టిఅన్యాక్రాంతములను నిరోధింపక ప్రోత్సహించుచుండెడివారు. కాలముజరిగినకొలదిని క్రమముగా ప్రభుత్వమువారు భూమిని కర్షకేతరులకు అన్యాక్రాంత మొనర్పజేయుట ఆర్థికముగాను, రాజకీయముగనుకూడ అపాయకరమనియు, కావున 'భూస్వేచ్ఛాన్యాక్రాంతము' (Free Alienation of Land) నిరోధించుసమయ మాసన్నమైనదనియు గ్రహించిరి. అందుచే కర్షకేతరులకు భూమి అన్యాక్రాంతము గాకుండ శాసనముద్వారా నిరోధింపదలచినవారు తత్కారణమున పరపతితగ్గినను రైతు ఋణముచేయుటకూడ తగ్గునుకాన నదియు మేలే నని భావించిరి. అందుచే పలుచోట్ల నీవిషయమై విచారణలు, ఆలోచనలు జరిగి కొన్నిచోట్ల శాసనములు వెలువడినవి,



జనరలు స్మట్సుగారు



లండనున నిరుద్యోగులు పోలీసుఠాణాపై దండెత్తుట. పోలీసులు వారిపై గుర్రములను పరుగెత్తించుట.

లండను ఇండియా కార్యాలయమున|భారతీయ చిత్రకారుల భిత్తిచిత్రరచన



వర్మగారు 'అనునయము' అను చిత్రమును చిత్రించుచుండుట



సేనుగారు 'బుద్ధుడు—అతనిశిష్యులు' అను చిత్రమును చిత్రించుచుండుట

దారులనుండియు, మహారాజులనుండియు, భూస్వాములనుండియు, పరిరక్షణసంరక్షకులు లేని మైనర్లయొక్కయు యెస్టేట్లను కాపాడుటకును పరిరక్షణవారి కప్పగించుటకును రెండుసంరక్షకశాసనములు గలవు.—
i. కోర్టు ఆఫ్ వార్డ్సు ఆక్టు (Court of Wards Act, ii,) ఎంకంబర్డు యెస్టేట్సు ఆక్టు(Encumbered Estates Act).

ఈప్రయత్నములన్నియు ముఖ్యఋణసమస్యను పరిష్కరింప జాలని వగుటచే, ధనవంతులయిన ప్రజలధనమును సహకారపద్ధతులపై కూర్చి బీదరయితుల ఋణనివారణమునకు వీలగునట్లు చేయుటయే ఋణనివారణసాధనమని సర్ విలియం వెడ్డర్ బరన్ (Sir William Wedderburn), న్యాయమూర్తి రనడే మొదలగు మహనీయులూహించి కావించినయత్నములు మొదట ఇంగ్లండులో ఇండియాకార్యదర్శిగారి అనుమతిని బడయనప్పటికిని, క్రమముగా ప్రభుత్వమువారు దీని యుపయోగమును గ్రహించి ౧౯౦౪ సంవత్సరమున సహకారపరపతిచట్టమును గావించిరి. సహకారపరపతిచరిత్రనుగూర్చి వ్రాయుట కిచ్చట ముద్దేశింపబడలేదు. కాని యీఉద్యమము రైతుజనమున కపారసేవ చేయుచున్న సంగతి గమనింపవలసినది. దీర్ఘకాలఋణము లొసగుటకు సామాన్యసహకారపరపతి తగినంత ఉపయోగించనందున భూమి తనఖాసహకారసంఘము లేర్పడ ప్రారంభమైనవి. ప్రభుత్వసహాయమును, ధార్మికదృష్టికలిగిన 'బ్యాంకు'లు ఇతర మహాశయుల ప్రోత్సాహమున అచిరకాలమున రైతు కత్యంతసేవ చేయగలవని యూహించెదము.

## ముగింపు

ఋణగ్రస్తులైన రయితులుగూడ తమ ఆర్థికస్థితిని చక్కబరచుకొనుటకు ప్రయత్నింపవలెను. ప్రతిఫలశూన్యఋణములు చేయుట మానవలెను. సాధ్యమైనంతవరకు దుబారాఖర్చు లేకుండగనే వ్యవసాయము చేసికొనవలెను. ఆధునికపాశ్చాత్యనాగరికసంబంధము కలవారు వ్యవసాయమన్నను, కాయకష్టమన్నను చులకనగా జూచుట కడుసంతాపకరము. అట్టివారు పాశ్చాత్యుల కట్టిదురూహలు లేవని గ్రహించుట మేలు. రైతులు వ్యవసాయపుపనులులేని కాలములో సోమరులై యుండక యేదైన గృహపరిశ్రమ నేర్పరచుకొని తమ ఆదాయమును వృద్ధిచేసికొనవలెను. రయితులకు తీర్చలేని ఋణములో మునిగిపోవుదు మనుభయము కల్గినతోడనే ఋణదాతలకడ కేగి వారి మంచితనముచే తమస్థితిని బాగుపరచుకొన యత్నింపవలెను. ప్రజానాయకులు రయితుసంస్థలు ఈఋణసమస్యను చేపట్టి ఋణదాతలకును, ఋణగ్రహీతలకును మధ్యగల దురభిప్రాయముల చక్కబరచి ఋణములను సక్రమముగా ధర్మదృష్టితో పరిష్కరించి రైతులోకమున శాంతిని నెలకొల్పి దేశకల్యాణమునకు తోడ్పడుదురుగాక. సకల ప్రకృతిసంపదల కాలవాలమైన భారతవర్షకర్షకులు శాంతిసుఖముల బడయుదురుగాక.

---

# మాతృపూజ

చింతలపూడి శేషగిరిరావుగారు

గౌతమీకృష్ణాదిపూతప్రవాహినీ సలిలప్రభావప్రశస్తిఁ గాంచి
శ్రీశైలభద్రగిరిప్రభృతిక్షేత్ర మాహాత్మ్యకలన సన్మానమంది
పరిపంథినృపవీరబహుశతఘ్నులకైన నందీని దుర్గసంచయము గలిగి
బీలుపోవకయె ముక్కారునుం బండు సస్యసమృద్ధి నిద్ధసౌష్ఠవముఁ బడసి
అల్ల పితృవాక్యపరిపాలనార్థ మటవి-కరుగు శ్రీరాము పాదవిన్యాసమంది
సద్యశోభాసినైన నాజన్మభూమి-యాంధ్రమాతకుఁ గేల్మోడ్తు నహరహంబు.

సల్పినారలుగదా, సర్వదిగ్విజయంబు వైరిరాజుల కన్నుకోరగింపఁ
జేసినారలుగదా, సీమసీమల కేఁగి యోడవర్తకము మహోన్నతముగ
వ్రాసినారలుగదా, బంధురతరహృద్య పద్యమండితసుప్రబంధచయము
నిల్పినారలుగదా, శిల్పనైపుణి మీఱ దీపితప్రాకారగోపురాళి
సాంఖ్యకాధ్యాత్మనైతిక చర్చలందుఁ-జూని పాల్గొని సిద్ధాంతపూర్వపక్ష
దక్షులై పారముఁ గ్రోలఁదగిరిగాదె-యఖిలశాస్త్రజ్ఞులు మదీయు లాంధ్రజనులు.

రాజమహేంద్రనూర్ఁ బురవరంబును రాజపదంబొసర్చి నా
నాజనరంజకంబుగ ననంతమహీవలయంబు నేలి వి
భ్రాజితభంగి నాంధ్రమున భారతసంహిత నిల్పినట్టి యా
రాజనరేంద్రుఁడుర్వి దెలుఁగురాజగు టారయ మాకు భాగ్యమే.

కలయు శిల్పాదివిద్యల వృద్ధిఁజేసి - వైరిరాజుల ప్రక్కలో బల్లెమగుచు
సార్థకాహ్వయుఁ డనఁగఁ బ్రశస్తిఁగన్న-యల్లప్రతాపరుద్రుఁడుగూడ నాంధ్రరాజె.

కృతు లందుకొని బహుళాకృతికినై కవులకు నగ్రహారము లిచ్చు త్యాగశీలి
పల్యంకికారోహభాగ్యోదయముఁగూడఁ గవులకుఁ జవిచూపు ఘనయశుండు
ప్రబలపరాక్రమప్రాభవోపేతుల క్షణములోపల గెల్చు శౌర్యమూర్తి
'దేశభాషలయందుఁ దెలుఁగు లెస్సఁగ'ని జేసి బహ్వాలంకృతిఁ జేయు పండితకవి
శత్రురక్తంబుతో జయశాసనములు - పెక్కు లిఖియింపనేర్చిన మొక్కలుండు
'మూరురాయరగండండు'మొదలుగాఁగ - బిరుదు లెన్నియో పొందిన వీరవరుఁడు
కృష్ణరాయ లాంధ్రుం డనుకీర్తి మాదె.

పగఱకును వెన్నిచ్చిన మగమగనుమ - స్నానవిధి స్త్రీలకుంబలె సంతరించి
పాఱివచ్చిన భర్తలఁ బోరికంపు - మానవతు లుండి రీయాంధ్రమండలమున.

భద్రగుణాకరయగు, ని - ర్నిద్రపరాక్రమఖనియు, వినీతయు, స్వచ్ఛా
త్యుద్రయశోనిధియగు మా - రుద్రమదేవియుఁ దెలుంగుప్రోడయకాదే!

ముద్దుపళనియు, వేంకమ, మొల్ల, మోహ - నాంగి మొదలగు కవయిత్రు లాంధ్రమాత
గర్భశుక్తిముక్తాత్వముఁ గాంచు టాంధ్ర - జనులు సల్పిన సుకృతాతిశయముగాదె!

బొబ్బిలివారల పౌరుష - మబ్బురముం గలుగఁజేయ నట్టె పరాసుల్
సిబ్బితిచెడి పిఱుదివియరె! - దెబ్బకుఁ దాళంగలేక దీనత దోఁపన్.

ఔర! పల్నాటివీరుల పౌరుషంబు - రెడ్డిరాజుల శౌర్యధురీణతయును
బోరఁజాలక కాలికి బుద్ధిఁజెప్ప - వైరులకుఁ గాక యన్యుల కేరికౌఁక

మంత్రాంగవిశారదుఁడు, స్వ - తంత్రుండు, సమస్తరాజ్యతంత్రజ్ఞుఁడు, దు
స్తంత్రవిభేదనచణుఁడౌ - మంత్రియుగంధరుఁడు తెల్గుమంత్రియకాదే!

పలుకునుడికారమున సొంపుగులుకునట్టు-లరఁటిపం డొల్చి చేతికి నందఁజేయు
రీతి భారత మాంధ్రీకరించినట్టి-యల కవిత్రయ మస్మదీయాంధ్రమాత
కడుపుచల్లఁగఁ గాంచిన కాన్పుగాదె!

స్వర్ణాభిషేకమందెను - స్వర్ణపుఁ బాత్రల భుజించెఁ బ్రభువుల పంక్తిన్
నిర్ణేతయయ్యెఁ గవితకు - వర్ణింతు మెటు కవిసార్వభౌముని బ్రజ్ఞల్?

'మందారమకరందమాధుర్య'గరిమతోఁ గవనంబు సెప్పెడి కవివరుండు
'కుప్పించి యెగసిన కుండలంబుల కాంతిఁ' గనులఁగట్టఁగఁజేయఁ గలుగు శిల్పి
'హాసలీలానిద్రలందును'హరిఁ గూడి యన్యంబు మఱచినయట్టి యోగి
'కోమల'యౌ కావ్యకోమలిం బ్రభువుల కమ్మఁబాలనియట్టి హాలికుండు
'చేతులారంగ శివునిఁ బూజించు'ఘనుఁడు-'నోరు నొవ్వంగ హరికీర్తి నుడువు'భక్తుఁ
డిచ్చు మెయి లేమిఁ గైకొని నొచ్చుకొనని-పోతనంబోలు కవు లన్యజాతిఁ గలరె?

ధరణిపుఁ డొక్కనాఁడు ప్రథితంబగు పద్యము సల్లఁగోరఁగా
నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతికవీడ్య, మాదిగా
వరతులు పెక్కుగోరి తుది సద్రసవత్పదపద్యమల్లు సు
స్థిరకవితాపితామహుఁడు తెల్గువనంబున సంచరింపఁడే!

గ్రథితమౌ కథాకల్పనాగౌరవమున - సందె వేసిన చెయ్యియై యలరినట్టి
యల్ల పింగళిసూరన, యాంధ్రమాత - 'బహుతపఃఫల'మని చెప్పవలసినట్టి
పుత్రరత్న; మేలిన్నాత్రపుసముఁడొక్కఁ!

ఇట్టి లోకైకమాన్యులే యిపుడుఁగూడఁ - గలరు కుప్పతెప్పలుగాఁగ; ఫలము గలదె?
లేఁడె చిక్కనవర గాఁడ్లు లేక కాదు - కాలవైపరీత్యమె దాని కారణంబు.

---



# స్మృతికణాలు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు

(వద్దాదే విరటరాజు ఏలిన రాజ్యానికి రాజధాని అంటారు. పెద్దపెద్ద మంటిదిబ్బలే అతని కోటలని, బలుసుతుప్పలు పెరిగిపోయిన బయలు ఆయనసభావేదిఅని, దానికి దగ్గరగా ఉన్న కంకరగుట్టలే సింహబలుని మేడలని ఇక్కడి ఇప్పటివారి నమ్మకం.)

౧

ఇదియంట మాత్స్యభూమీశుని పెనుఁగోట మంటిదిబ్బలుగ మాఁకంటి కమరె
ఇదియంట మత్స్యరాణ్మందిరపీఠంబు బలుసుతుప్పల బరాబరులు నేఁడు
ఇదియంట యుత్తరాసుదతినాట్యపుశాల నక్కత్రొక్కుడులు మానాఁటి మాట
ఇదియంట కీచకోర్వీశు పాపపుజాడ ఎఱ్ఱకంకరగుట్టపట్ట లిపుడు
ఇదియంట దురంతకౌరవుల్ చెదరి మేయు-గోవులనుబట్టి యనికి డీకొనిన తావు
కలకుముండుల తుమ్మవృక్షములతోడఁ గ్రాలె నొక్కబయలుగ మాకాలమునకు.

౨

ఎన్నఁడు మావిరాట్ధరణీశ్వరు ప్రోలిని ధర్మదీక్షితుల్
బన్నము లంది, తత్పురవిభవంబున నొక్కొకయప్డు తేనిచే
మన్నన లంది, దివ్యమహిమంబునఁ గ్రాలినవారొ? యేకడ
న్నన్నులమిన్న యుత్తరబృహన్నల నాట్యము చిందులాడెనో?

౩

ఉత్తరకుమారునితో—

కట! కట! రాచపుట్టువవుగావె యెటుంబలె నాఁడువారిలో
దిటవున బొబ్బగొట్టుచు నదీను బృహన్నలఁ దూలనాడి యు
త్కటరథసంబుఁ జూపి, యిటు కౌరవనాథమహావరూథినీ
చటులభటార్భటీరతికి జంకితి బొంకితి తత్త నుత్తరా!

౪

కీచకునితో—

పాపము పాపమయ్య పెఱభామల నన్యపరాయణావిలాసనం
జీవితనాశముం గని, మదన్ భ్రమగూరిచి తుచ్ఛవైభవో
న్మాదసముద్ధతోట; తన్వసుమి సాధ్వి, తపస్విని, ధర్మమూర్తియౌ
ద్రౌపది చెట్టబట్టఁగఁ దలంచుట నిక్కము నమ్ము కీచకా!

౫

కీచకవధ—

అరరే!!! యెంతపనియయ్యె ననిలసుతుండు - పాపచింతల భ్రమసి పైఁబడిన కీచ
కావనిపు గుండెపై ముష్టిఘాతవృష్టిఁ - బఱపి రక్తంబు గ్రక్క నిబర్హణించె.

౬

విరాటుని కోపం—

ఆ! విరాటధరాధీశ ఆఁగు మాఁగు - మయుడఁబోకుము కనలి ధర్మజు నుదుట
అయ్యయో! యెంతలోఁ దొందరయ్య నీకు - సారెతోఁ గొట్టితివి రక్తధార లురుల.

౭

ద్రౌపదీ!—

రమ్మర యిమ్మటు లో ద్రౌపదమ్మ వేగ - హస్తమునఁ బట్టికొనుము యీ యశ్రుధార
చెదరి యీరక్త మిటుఁ గోంతి చిందెనేని - ధ్వంసమైపోవు మారాజధాని యెల్ల.
"మాదేశములు వేల్చె నోష్ఠాది మసియొనర్చె"

౮

ఆతపస్విని చేమాటో యదరిపోవ - తొలకినది యేమొ రక్తబిందుపుకణంబు
అట్టి పాపపు మంటయే కట్టికుడిపె - నేమొ శ్రీకృష్ణరాయులు నేచివచ్చి
పనచెడంగ మావష్టాది మసియొనర్చె.

---